శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# సాంప్రదాయిక వ్యాస మాలిక – 11



వీరరాఘవ స్వామి, తిరువళ్ళూర్



'పండితరత్న' డా॥ ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళ్గియ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

# నాలాయిర దివ్య ప్రబంధం

దృష్టం సూరివరైః శఠారికలిహశ్రీభట్టనాథాదిభిః
శ్రీశానుగ్రహలబ్ధదివ్యవిశదజ్ఞానైః కృపామూర్తిభిః,
శ్రీనారాయణవైభవస్తుతిపరం సర్వార్థికల్పద్రుమం
సేవేహం ద్రవిడాగమం సకలసంసేవ్యం సదా భక్తితః.
శ్రుతిస్మృతిపురాణాదిదివ్యసూర్యుక్తిమూలకః,
జయతూభయవేదాంతసంప్రదాయ స్సనాతనః,
జయత్వమృతధారేయం సదాచార్యపరంపరా,
సంసారసర్పసందష్టా సంజీవ్యంతే యయా సదా
శ్రీరామానుజసిద్ధాంతో జగత్కల్యాణకారకః,
జయతాత్ జయతాన్నిత్యం లోకే పరమవైదికః.

దివ్యసూరులు అనబడే ఆళ్వారులు పన్నెండుమంది. వీరు అనుగ్రహించిన ద్రావిడ ప్రబంధాలు భక్తిసంప్రదాయానికి కరదీపికలు. ఈ ప్రబంధాలలోని పాశురాల సంఖ్య సుమారు నాలుగు వేలు అయినందున ఇవి నాలాయిర దివ్యప్రబంధం అనే పేరుతో వ్యవహరింపబడుతున్నాయి. ఆయిరం అంటే వేయి. దివ్యమంటే అలౌకికమైన అని అర్థం. శ్రీమన్నారాయణుని దివ్యమైన స్వరూపరూపగుణ విభూతిలీలాదులను ప్రతిపాదిస్తున్నందున వీటికి దివ్య ప్రబంధాలు అనే పేరు కలిగింది. ఇవి మొత్తం 24 ప్రబంధాలు. ఈ ప్రబంధాలద్వారా నాలుగు వేదాలలోని తత్త్వాలను ఆళ్వారులు ద్రావిడ భాషలో వ్యక్తం చేసినందున ద్రావిడవేదం అనే పేరు కూడా వీటికి ప్రసిద్ధి చెందింది.

నాలాయిర దివ్యప్రబంధం ముదలాయిరమ్, పెరియ తిరుమొళి, ఇయఱ్పా, తిరువాయ్ మొళి– అనే నాలుగు విభాగాలను కలిగినది. ఈ విభాగాన్ని శ్రీనాథమునులు చేశారు. ఈ విధంగా ఈ విధంగా ఆళ్వారుల ప్రబంధాలను నాలుగు విభాగాలుగా శ్రీమన్నాథమునులు చేయడంలోని తాత్పర్యాన్ని గమనించిన మన

పూర్వాచార్యులు వీటిని ప్రణవార్థరూపాలుగా, వేదార్థ ప్రతిపాదకాలుగా, రహస్యత్రయార్థ వివరణరూపాలుగా వివరించారు.

**నాలాయిర దివ్య ప్రబంధాల ప్రణవార్థవివరణం, వాటి వేదసామ్యం:**

ముదలాయిరమ్ అనే మొదటి వేయిలోని మొదటి ప్రబంధం తిరుప్పల్లాండు. ఈ ప్రబంధం ప్రణవార్థాన్ని వివరిస్తున్నది. ఈ విషయాన్ని శ్రీవరవరమునులు ఉపదేశ రత్తినమాలై ప్రబంధంలో "కోదిలవా మాళ్వార్ కళ్ కూఱుకళైక్కెల్లామ్ ఆది తిరుప్పల్లాణ్డదానదువుమ్, వేదత్తుక్కు ఓమెన్నుమదుపోల్ ఉళ్ళదుక్కెల్లామ్ శురుక్కాయ్ తాన్ మంగళమాదలాల్" (ఏ దోషం లేని ఆళ్వారుల సూక్తులకు అన్నిటికీ ప్రారంభం తిరుప్పల్లాండు కావడం ఎందుకంటే–వేదాల్లోని అర్థం అంతా ఓంకారం అనే ప్రణవంలో ఇమిడి ఉన్నట్లే దివ్య ప్రబంధాల అర్థం అంతా తిరుప్పల్లాండులో ఇమిడి ఉన్నది కనుక, మంగళరూపమైనది కనుక) అని తెలియజేశారు. ఈ సూక్తిని వివరిస్తూ పిళ్లై లోకమ్ జీయర్ " ప్రణవాన్ని ఆరంభంలో కలిగిన తిరు మంత్రం ప్రాప్యమైన భగవత్కైంకర్యాన్ని ప్రధానంగా ప్రతిపాదిస్తున్న ట్లే, ఈ ప్రబంధంకూడా భగవానుని మంగళాశాసననరూపమైన కైంకర్యాన్ని ప్రతిపాదిస్తున్నది" అని అన్నారు. శ్రీ పిళ్ళైలోకాచార్యులవారు ముముక్షుప్పడి గ్రంథంలో – అష్టాక్షరిలోని మూడు పదాలలో మొదటి పదమైన ఓంకారాన్ని మిగిలిన 2 పదాలు వివరిస్తున్నాయి, అంటే, ఓంకారాన్ని నమః, నారాయణాయ – అనే రెండు పదాలు వివరిస్తున్నవి – అని తెలియజేశారు. దీనివల్ల వేదమంతా ప్రణవవివరణం అయినట్లే, మిగిలిన దివ్య ప్రబంధాలు అన్నీ కూడా తిరుప్పల్లాండు ప్రబంధాన్ని వివరిస్తున్నాయి – అని ఏర్పడుతున్నది. దీనివల్ల దివ్యప్రబంధాల వేదసామ్యం స్ఫురిస్తున్నది. ఇంతేకాక, తిరుప్పల్లాండు ప్రబంధం ప్రణవార్థాన్ని వివరిస్తున్నది కనుక, మిగిలిన దివ్యప్రబంధాలు తిరుప్పల్లాండుకు వివరణరూపాలే కనుక, ఆళ్వారుల ప్రబంధాలన్నీ ప్రణవార్థ వివరణరూపాలని తెలుస్తున్నది.

వేరొక రీతిలోకూడా ఆళ్వారుల ప్రబంధాల వేద సామ్యం సిద్ధిస్తుంది. ఆళ్వారులు అందరిలో నమ్మాళ్వారులు ప్రధానులు. ఆవిధంగానే, ఆళ్వారుల ప్రబంధాలు అన్నిటిలో నమ్మాళ్వార్ ప్రబంధాలు నాలుగు అంగి ప్రబంధాలుగా చెప్పబడుతున్నాయి. తిరువిరుత్తం, తిరువాశిరియమ్, పెరియ తిరువందాది, తిరువాయ్ మొళి – అనే ఈ నాలుగు ప్రబంధాలు నాలుగు వేదాల సారమని ఆచార్యహృదయగ్రంథకారులు నాయనార్ అన్నారు. ఈ క్రమంలో – నూరు పాశురాలను కల తిరువిరుత్తప్రబంధం నూరు శాఖలను కల ఋగ్వేదానికి సారమని, ఏడు పాశురాలను కల తిరువాశిరియప్రబంధం ఏడు కాండలను కల యజుర్వేదానికి సారమని, వేయికి మించిన పాశురాలను కల, సహస్రగాథగా చెప్పబడే తిరువాయ్ మొళి వేయి శాఖలను కల సామవేదానికి సారంగా, 87 పాశురాలను కల పెరియ తిరువందాది అథర్వణ వేదసారంగా చెప్పబడుతున్నాయి. ఈ విషయం ఆచార్య హృదయ గ్రంథంలో స్పష్టం. "ఋచః సామ రసః" అనేవిధంగా శతశాఖలను ఋగ్వేదం గానరూపమై, వేయి శాఖలను కల సామవేదంగా విస్తరించినట్లు, నూరు పాశురాలను కల తిరువిరుత్తప్రబంధం వేయి పాశురాలను కల తిరువాయ్ మొళిగా విస్తరించిందని, దానివల్లనే ఆ ప్రబంధం "శతమూలా"(నూరు పాశురాలను కల తిరువిరుత్తాన్ని మూలంగా కలిగినది) అని వేదంలో కీర్తింపబడినదని విజ్ఞుల వివరణం. "సామ్న ఉద్గీథో రసః" అనే విధంగా తిరువిరుత్తప్రబంధంలోని ఏ పాశురంలోని భావం తిరువాయ్ మొళిలోని ఏ దశకంలో చేయబడిందో ఆ వివరాన్ని కూడా పెద్దలు తెలిపారు. సామవేదానికి సారం ఉద్గీథప్రణవం. ఈ ప్రణవంలోని మూడు అక్షరాలైన అకార, ఉకార, మకారాలు తిరువాయ్ మొళిలోని మొదటి పాశురంలో గల మొదటి మూడు పాదాల ఆరంభంలో కూర్పబడడంవల్ల, ఆ ప్రబంధంలోని ఆద్యంతవర్ణాలు "ఉత్" అనే ఉద్గీథనామాన్ని సూచించడంవల్ల ఆ ప్రబంధం ఉద్గీథరూపమై, సామవేదసారమై విలసిల్లుతున్నదనికూడా పూర్వాచార్యుల అభిప్రాయం.

నమ్మాళ్వారుల ప్రబంధాలు నాలుగు వేదాల సారాలు అనే సమన్వయానికి అనుగుణంగా తిరుమంగై ఆళ్వార్ అనుగ్రహించిన ఆరు ప్రబంధాలు

వేదాంగస్థానీయాలుగా పరిగణింపబడుతున్నాయి. ఇవి నమ్మాళ్వారుల ప్రబంధాలను నాల్గింటిని వివరిస్తున్నది, కనుక అవి వేదాంగాలుగా పరిగణింపబడుతున్నాయి – అనే విషయాన్ని శ్రీ వరవరమునులు ఉపదేశ రత్తినమాలై ప్రబంధంలో "మాఱన్ పణిత్త తమిళ్ మఱైక్కు మంగైయర్ కోన్ ఆఱఙ్గమ్ కూఱ అవతరిత్త"(నమ్మాళ్వారులు అనుగ్రహించిన, నాలుగు వేదాల సారాలైన నాలుగు ప్రబంధాలకు తిరుమంగై ఆళ్వార్లు అనుగ్రహించిన ఆరు ప్రబంధాలు ఆరు వేదాంగాలవంటివి) అని తెలిపారు ఇక మిగిలిన ఆళ్వారుల ప్రబంధాలు ఉపాంగాలు. ఈవిధంగా ఆళ్వారుల ప్రబంధాలన్నీ వేదాల అర్థాన్ని వివరిస్తూ ఉన్నవి – అని చెప్పవచ్చు. ఇది క్లుప్తంగా దివ్యప్రబంధాల వేదసామ్యవివరణం.

**నాలాయిరదివ్యప్రబంధం అష్టాక్షరీమంత్రార్థ ప్రకాశకం:**

ఆళ్వారుల ప్రబంధాలు అష్టాక్షరీమంత్రార్థ ప్రకాశకాలు – అనికూడా పూర్వాచార్యుల వివరణం. కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధాన్ని వివరిస్తూ పెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన వ్యాఖ్యానానికి పూర్వాచార్యులు సంతరించిన అమూల్యమైన అరుంబదం ఒకటి ఉన్నది. (అరుంబదమంటే–వ్యాఖ్యానంలోని జటిలమైన విషయాలను వివరించే లఘుటీక) ఆ అరుంబదం ఆరంభంలో "తిరుమంత్రార్థప్రతిపాదకఙ్గళాన దివ్యప్రబంధఙ్గళై వ్యాఖ్యానమ్ శెయ్ దరుళుకిఱ పరమకారుణికరాన పెరియ వాచ్చాన్ పిళ్ళై తమ్ముడైయ పరమకృపైయాలే వేదత్తుక్కు ఓమెన్నుమదుపోల్ ఉళ్ళదుక్కెల్లామ్ శురుక్కాన తిరుప్పల్లాండుక్కుమ్, మత్తిమమామ్ పదమ్ పోల్ శీర్ త్త మదురకవి శెయ్ కలైక్కుమ్, తృతీయపదార్థప్రతిపాదకఙ్గళాన మట్రుముళ్ళ దివ్యప్రబంధఙ్గళుక్కుమ్" (తిరుమంత్రార్థాన్ని తాలిపే దివ్య ప్రబంధాలను వ్యాఖ్యానించే పరమకృపాళువైన పెరియవాచ్చాన్ పిళ్ళై తమ గొప్ప కృపతో వేదానికి ప్రణవం సంగ్రహం అయినట్లు, దివ్యప్రబంధాలకు అన్నిటికీ సంగ్రహరూపమైన తిరుప్పల్లాండుకు, అష్టాక్షరిలోని మధ్యమ పదమైన నమస్సుతో పోలిన, మధుర కవులు అనుగ్రహించిన శాస్త్రరూపమైన కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధానికి, మూడవ పదమైన

"నారాయణాయ" అనే పదంలోని అర్థాన్ని తెలిపే మిగిలిన దివ్య ప్రబంధాలకు) అనే వివరణ సూక్తి గోచరిస్తుంది ఇది స్పష్టంగా ఆళ్వారుల దివ్యప్రబంధాలు అష్టాక్షరీ మంత్రార్థప్రకాశకాలు – అనే అంశాన్ని స్పష్టం చేస్తున్నది.

పెరియవాచ్చాన్పిళ్ళై వ్యాఖ్యాన శ్రీసూక్తి:

ఈ విషయాన్ని పెరియవాచ్చాన్ పిళ్ళై శ్రీసూక్తి ద్వారాకూడా గమనించవచ్చు. తిరుప్పల్లాండు ప్రబంధంలోని "అడియోమోడుమ్" అనే రెండవ పాశుర వ్యాఖ్యానంలో చివరలో పెరియవాచ్చాన్ పిళ్ళై "ఇవ్విరణ్డు పాట్టుమ్ తిరుమంత్రార్థమాయిరుక్కిఱదు. 'అడియోమోడుమ్' ఎన్గిఱ విడత్తాలే ప్రణవార్థత్తై శొల్లిట్రు. ముదఱ్పాట్టిల్ 'పల్లాండు' ఎన్గిఱ ప్రథమపదత్తాలే నమశ్శబ్దార్థమ్ శొల్లిట్రు. 'మల్లాండ తిణ్డోళ్ మణివణ్ణా' ఎన్గఱ అప్పాట్టిల్ విగ్రహయోగత్తైయుమ్, శౌర్యవీర్యాదిగుణయోగత్తైయుమ్, ఇరణ్డామ్ పాట్టిల్ విభూతియోగత్తైయుమ్ శొల్లుకైయాలే నారాయణపదార్థమ్ శొల్లిట్రు. 'ఉన్ శేవడి శెవ్వి తిరుక్కాప్పు' ఎన్గైయాలే చతుర్థియిల్ ప్రార్థిక్కిఱ అర్థత్తై చ్చొల్లిట్రాయిట్రు. "(ఈ రెండు పాశురాలు తిరుమంత్రార్థరూపమై ఉన్నాయి. "ఆడియోమోడుమ్" అనే పదంద్వారా ప్రణవార్థం తెలుపబడింది. మొదటి పాశురంలోని "పల్లాండు" అనే పదంద్వారా నమశ్శబ్దార్థం తెలుపబడింది. "మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా" అనే పాశురంలో పాశురంలో దివ్యమంగళ విగ్రహాన్నికలిగి ఉండడం, శౌర్యం, వీర్యం మొదలైన గుణాలను కలిగి ఉండడం రెండవ పాశురంలో నిత్య లీలా విభూతులను కలిగి ఉండడం చెప్పబడినందున నారాయణశబ్దార్థం తెలుపబడింది. "ఉన్ శేవడి శెవ్వి తిరుక్కాప్పు" అని అన్నందున నారాయణ పదంలోని చతుర్థి విభక్తిద్వారా చేయబడిన కైంకర్యప్రార్థన చెప్పబడింది) అని అంటూ మొదటి రెండు పాశురాలు అష్టాక్షరీమంత్రార్థాన్ని తెలుపుతున్నవి – అని అన్నారు.

ఇక్కడ ఇంకొక ఒక విషయం గమనించదగినది ఉన్నది. ప్రబంధంలోని మొదటి పాశురాలు ఆ ప్రబంధార్థాన్ని సంగ్రహంగా తెలియజేస్తాయి – అనేది శాస్త్రక్రమం. ఈ

క్రమంలో తిరుప్పల్లాండు ప్రబంధం లోని మొదటి రెండు పాశురాలు తిరుమంత్రార్థప్రకాశకాలైనపుడు, ఆ ప్రబంధలోని ప్రమేయం అష్టాక్షరీమంత్రార్థం – అని అనడంలో అడ్డు లేదు. ఆ క్రమంలోనే దివ్య ప్రబంధాలలోని మొదటి ప్రబంధమైన తిరుప్పల్లాండుప్రబంధం అష్టాక్షరీ మంత్రార్థాన్ని వివరిస్తున్నప్పుడు, ఆ ప్రబంధానికి వివరణరూపాలైన మిగిలిన ప్రబంధాలు అన్నీ ఆ మంత్రార్థాన్ని వివరిస్తున్నాయి – అని అనడం యుక్తియుక్తం. అందువల్ల నాలాయిర దివ్య ప్రబంధం అంతా అష్టాక్షరీవివరణరూపమని చెప్పవచ్చు. అయితే, ఇక్కడ ఇంకో విషయాన్ని కూడా గమనించాలి. తిరుప్పల్లాండు ప్రణవాన్ని వివరిస్తున్నది – అనే సమన్వయానికి, అష్టాక్షరీ మంత్రార్థాన్ని తెలుపుతున్నది – అనే సమన్వయానికి మధ్య అర్థవిరోధం ఉన్నదని భావించరాదు. "యోజనా యోజనాంతరం న బాధతే" కదా. ఒక సమన్వయానికి ఇంకొక సమన్వయ విరుద్ధం కాబోదు. అయితే, అవి రెండు ప్రమాణాలకు అనుకూలంగా ఉండాలి.

ఈ విధంగా అష్టాక్షరీ మంత్రార్థాన్ని తిరుప్పల్లాండులో ప్రారంభంలో అనుసంధించడమే కాక, చివరలో కూడా ఈ మంత్రాన్ని "నమో నారాయణాయ" అని అంటూ శబ్దతః పదకొండవ, పన్నెండవ పాశురాలలో రెండుసార్లు భట్టనాథులు అనుసంధించారు. ఇక్కడ ఈ మంత్రం ప్రణవంతో కలిపి ఉచ్చరింపబడలేదు – అనే కొరత తీరేటట్లు పదవ పాశురంలో ప్రణవార్థాన్ని "ఉన్దనక్కు అడియోమెన్ఱు ఎళుత్తుప్పట్ట" అని ఆళ్వారులు అర్థతః అనుసంధించారు. ఈ ప్రయోగాన్ని పెరియవాచ్చాన్ పిళ్ళై ప్రణవార్థాన్ని తెలుపుతున్నదని వివరించడం గమనించవచ్చు. ఈ విధంగా ఆద్యంతాలలో అష్టాక్షరీమంత్రార్థాన్ని అనుసంధించే తిరుప్పల్లాండు ప్రబంధం ప్రత్యాహార న్యాయంలో అష్టాక్షరీమంత్రార్థరూపమని అనడంలో అడ్డు లేదుకదా!

ముదలాయిరంలో తిరుప్పల్లాండు తర్వాత ఉండే తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళి ప్రబంధాలు రెండుజీవుని అనన్యార్హశేషత్వాన్ని ఆవధారణార్థంద్వారా ద్రఢీకరించే, ప్రణవంలోని 'ఉ'కారంలోని అర్థాన్ని అనుసంధిస్తున్నవి. ఇందుకు

తిరుప్పావైప్రబంధంలోని "ఉన్దన్నోడుట్రోమే యావోమ్, ఉనక్కే నామాట్చెయ్ వోమ్" (నీతోనే శేషత్వసంబంధాన్ని కలవారమవుతాము. నీకే కైంకర్యం చేస్తాము) అని, "మానిడవర్క్కెన్ఱు పేచ్చుప్పడిల్ వాళకిల్లేన్"(నేను మానవమాత్రులకు –అనే మాట వింటే బతుకలేను) అని గల సూక్తులు ఇందుకు ఉదాహరణాలు. అష్టాక్షరిలోని 'ఉ'కారం భర్తృభార్యాసంబంధాన్ని తెలుపుతున్నదని శ్రీపిళ్ళైలోకాచార్యులవారు నవవిధ సంబంధం అనే గ్రంథంలో అన్నారు. అందువల్ల భగవానునకు పత్ని అయిన గోదాదేవి పలికిన ఈ సూక్తులు ఉకారార్థాన్ని తెలుపుతున్నాయి – అని భావించడంకూడా తగినది. పెరుమాళ్ తిరుమొళి ప్రబంధం "పడియాయ్ కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే" (నీ కోవెలలో గడపగా పడి ఉండి, పగడంవంటి నీ అధరాన్ని దర్శిస్తాను") ఇత్యాదిగా జీవుని శేషత్వజ్ఞాతృత్వాలను తెలిపే సూక్తులద్వారా ప్రణవంలోని మకారంయొక్క అర్థాన్ని, తిరుచ్చందవిరుత్త ప్రబంధం, తిరుమాలై ప్రబంధం జీవుని శేషిత్వాన్ని తెలిపే చతుర్థీవిభక్తితో కూడిన అకారంలోని అర్థాన్ని విశదం చేస్తున్నాయి. భగవానునకు సుప్రభాతం పలికే తిరుప్పళ్ళి ఎళుచ్చి ప్రబంధం జీవేశ్వరుల రక్ష్యరక్షకభావంలోని పరమావధిని సూచిస్తున్నందున అది అకారార్థప్రతిపాదకం. ఈవిధంగా ముదలాయిరంలో పల్లాండు తర్వాత ఉండే ఈ ప్రబంధాలు అన్నీ ప్రణవార్థాన్ని ప్రకాశింపజేస్తున్నాయి. చివర ఉండే అమలనాది పిరాన్ ప్రబంధంకూడా మొదటి మూడు పాశురాలు ప్రణవంలోని మొదటి మూడు అక్షరాలైన 'అ'కార, 'ఉ'కార, 'మ'కారాలతో ఆరంభం అవుతున్నందున ఆ ప్రబంధం ప్రణవరూపమనే అంశము శబ్దతః సూచింపబడింది. ఆ ప్రబంధంలోని పాశురాలలో ప్రణవార్థం విశదీకరింపబడిన వైనాన్ని ఆ ప్రబంధవ్యాఖ్యానాలలో దర్శించవచ్చు. ఈ విధంగా ముదలయిరంలో పల్లాండునుండి అమల నాది పిరాన్ వరకు ఉండే ప్రబంధాలు అన్నీ ప్రణవార్థాన్ని అనుశీలనం చేస్తున్నాయి అని చెప్పవచ్చు.

ఇక, కణ్ణినుణ్ శిఱుత్తాంబుప్రబంధం నమశ్శబ్దార్థతాత్పర్యప్రతిపాదకం. ఈ ప్రబంధంలో జీవుని అనన్యార్హశేషత్వం, అనన్యశరణత్వం, అనన్య భోగ్యత్వం

భాగవతపర్యంతంగా అనుసంధింప బడ్డాయి. అష్టాక్షరీమంత్రంలోని నమస్సుయొక్క తాత్పర్యంకూడా ఇదే కదా. శ్రీ శ్రీపిళ్ళైలోకా చార్యులవారు ముముక్షుప్పడిగ్రంథంలో "ఇదుతాన్ స్వరూపత్తైయుమ్, ఉపాయత్తైయుమ్, ఫలత్తైయుమ్ కాట్టుమ్" అని నమశ్శబ్దం జీవుని స్వరుప, ఉపాయ, పురుషార్థాలను మూడిటిని తెలుపుతున్నదని పలికి, వెనువెంటనే, "ఇదిలే భాగవతశేషత్వమనుసంధేయమ్"(ఈ నమశ్శబ్దంలో భాగవతశేషత్వాన్ని అనుసంధించాలి) అనే సూత్రాన్ని అనుగ్రహించి, దానికి ప్రమాణంగా "నిన్ తిరవెట్టెళుత్తుమ్ కట్రు నాన్ ఉట్రదుమ్ ఉన్నడియార్కడిమై" (నీ అష్టాక్షరిని అభ్యసించి, భాగవతశేషత్వం దాని తాత్పర్యంగా గ్రహించాను) అనే తిరుమంగై ఆళ్వారుల సూక్తిని ఉదాహరించారు. ఈ అర్థమే కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధంలో ప్రతిపాదింపబడినందున అది ముదలాయిరంలోని ప్రణవార్థప్రతిపాదకాలైన ప్రబంధాలకు తరువాత చివరి ప్రబంధంగా కూర్చబడింది. "ఆర్ త్త పుకళ్ ఆరియర్ కళ్ తాజ్గళ్ అరుళిచ్చెయల్ నడువే శేర్ విత్తార్ తాత్పరియమ్ తేర్ న్దు" అని శ్రీవరవరమునులు ఈ విషయాన్ని ఉపదేశ రత్తినమాలై ప్రబంధంలో తెలిపారు.

**పెరియ తిరుమొళి "నారాయణ" పదార్థ ప్రతిపాదకం:**

రెండవ ఆయిరమ్ అయిన పెరియ తిరుమొళి నుండి మూడవ ఆయిరం అయిన ఇయఱ్పా చివరి వరకు ఉండే మిగిలిన భాగం అంతా అష్టాక్షరీమంత్రంలోని నారాయణశబ్దంలో, ఆ పదంపై ఉండే చతుర్థీవిభక్తిలో ఉండే అర్థాన్ని ప్రతిపాదిస్తున్నది — అని పూర్వాచార్యుల అభిప్రాయం. ఈ వివరణను శ్రీ పిళ్ళైలోకమ్ జీయర్ ఉపదేశరత్తినమాలై ప్రబంధంలోని "వాయిత్త తిరుమన్దిరత్తిన్" అనే పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ "తిరుప్పల్లాండునుండి కణ్ణినుణ్ శిఱుత్తాంబువరకు ఉండే ప్రబంధాలు ప్రణవార్థంగా, కణ్ణినుణ్ శిఱుత్తాంబు నమశ్శబ్దార్థంగా, తరువాత, "నారాయణా ఎన్నుమ్ నామమ్" అని ప్రారంభించి అర్థాన్ని ఉపపాదించే పెరియ తిరుమొళి ప్రబంధం నుండి ఇయఱ్పాలోని తిరుమడల్ వరకు ఉండే ప్రబంధాలు నారాయణశబ్దార్థంగా,

కైంకర్యత్వరను సూచించే చతుర్థీవిభక్తిలోని అర్థంగా భావించవచ్చు కదా అని పలకడం గమనించవచ్చు.

పెరియ తిరుమొళి ప్రబంధం నారాయణ నామానుసంధానంతో ప్రారంభం అవుతున్నది. ఆ ప్రబంధంలో అంతా భగవానుడు అభిమానించి వేంచేసి ఉండే పలు దివ్యదేశాల వైభవం, అక్కడ ఉండే అర్చామూర్తుల వైభవం కీర్తింపబడినందున నారాయణనామం అర్థతః అనుసంధింపబడింది. ఈ విధంగా ఈ ప్రబంధం నారాయణ శబ్దార్థప్రతిపాదకం.

ఈ ప్రబంధం మహానారాయణోపనిషత్ లోని అర్థాన్ని ప్రతిపాదిస్తున్నది – అని పూర్వాచార్యులు అభిప్రాయపడ్డారు. నారాయణోపనిషత్ "అథ పురుషో హ వై నారాయణో కామయత" అని నారాయణనామానుసంధానంతో ఆరంభమై, మధ్యలో "బ్రహ్మా నారాయణః శివశ్చ నారాయణః…. అంతర్బహిశ్చ నారాయణః" అని నారాయణ శబ్దార్థాన్ని అనుసంధించి, చివరలో "బ్రహ్మణ్యో దేవకీపుత్రో బ్రహ్మణ్యో మధుసూదనోమ్" అని మధుసూదననామానుసంధానంతో ముగుస్తున్నది. ఈ విధంగానే, పెరియ తిరుమొళి ప్రబంధంకూడా నారాయణనామంతో ఆరంభమై, మధ్యలో "ఎమ్బిరాన్ ఎన్దై ఎన్నుడై చ్చుట్రమ్" (నాకు ఉపకారకుడు, నా తండ్రి, నా బంధువు) అని నారాయణశబ్దార్థాన్ని అనువదించి, చివరలో "మణియే! మణిమాణిక్కమే మదుశూదా!" అని మధుసూదన నామనుసంధానంతో పూర్తి అవుతున్నది.

## ఇయఱ్పా, తిరువాయ్ మొళి "ఆయ" శబ్దార్థప్రతిపాదకాలు:

ఇయఱ్పాలోని తిరువందాది ప్రబంధాలలో "శూట్టినేన్ శొల్ మాలై" అని, "ఞానచ్చుడర్ విళక్కేట్రినేన్" అని, తిరుక్కణ్డేన్ పొన్ మేని కణ్డేన్" అని ఆరంభంలోనే కైంకర్యత్వర సూచింపబడింది. తిరువిరుత్తప్రబంధంలోని మొదటి, చివరి పాశురాలు తప్ప, మిగిలిన అన్ని పాశురాలు నాయకీభావంతో ఆళ్వార్లు పలుకడంకూడా ప్రాప్యత్వరను సూచిస్తున్నాయి. మడల్ ప్రబంధాల అవతరణకు ప్రాప్యత్వర

కారణమనేది స్పష్టం. తిరువాశిరియ ప్రబంధం భగవానుని దివ్యమంగళవిగ్రహానుభవరూపమైనది. వీనిని అన్నిటిని గమనిస్తే, ఇయఱ్పా అనే సహస్రం "ఆయ" శబ్దార్థమని భావించడంలో అడ్డు లేదు.
ఈ విధంగానే తిరువాయ్ మొళి ప్రబంధంకూడా 'తొళుదెళు' అని ప్రాప్యత్వరతో ఆరంభమైనది. నాయకీభావాన్ని పొందిన పలు దశకాలలో ఆ త్వర ఉపబృంహితమై, "అవా అఱ" అని ఆ త్వర ఉపశమించడంతో ముగుస్తున్నది. అందువల్ల ఇది కూడా "ఆయ" శబ్దార్థప్రతిపాదకం. ఈ రీతిలో నాలాయిరం మొత్తం అష్టాక్షరీమంత్రార్థవివరణాత్మకమని చెప్పవచ్చు.

పెరియ తిరుమొళి ప్రబంధానికి పూర్వులు అనుగ్రహించిన అరుంబదంలో "ఇవై ఇత్తనైయాలుమ్ తిరుమంత్రత్తిల్ ప్రణవనమస్సుక్కళిల్ అర్థఙ్గళ్ ప్రాధాన్యేన ప్రతిపాదిక్కప్పడుకైయాలే, తత్ స్థానీయమాన ముదలాయిరత్తై తిరువుళ్ళత్తిల్ వైత్తుక్కొణ్డు, తృతీయపదస్థానీయమాన తిరుమొళిక్కు వ్యాఖ్యానమ్ శెయ్ దరుళ నినైక్కిఱార్" (ముదలాయిరంలోని ఈ ప్రబంధాలు అన్నిటిద్వారా తిరుమంత్రంలోని ప్రణవ నమస్సుల అర్థం ప్రధానంగా ప్రతిపాదించబడినందున, ఆ ప్రణవ నమస్సుల స్థానంలో ముదలాయిరాన్ని భావించి, అష్టాక్షరిలోని "నారాయణాయ" అనే మూడవ పదాన్ని వివరించే పెరియ తిరుమొళికి వ్యాఖ్యానాన్ని చేయాలని భావించారు) అని చెప్పబడినందున ముదలాయిరంలో ప్రణవ నమస్సుల అర్థం, పెరియ తిరుమొళి ప్రబంధంలో తృతీయపదమైన "నారాయణాయ" అనే పదంలోని అర్థం అనుసంధించబడిందని, ఈ సమన్వయాన్ని దృష్టిలో పెట్టుకొని పెరియ వాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానాన్ని రచించారని స్పష్టమవుతున్నది. ఈ క్రమంలో అష్టాక్షరీ మంత్రార్థవివరణం ముదలాయిరం, పెరియ తిరుమొళి అనే మొదటి రెండు సహస్రాలతో పూర్తి అవుతున్నది.

ఇక మిగిలిన సహస్రాలైన ఇయఱ్పా, తిరువాయ్ మొళి అనే మూడవ, నాల్గవ సహస్రాలలో వేని తెలుపబడింది? - అనే విచికిత్స ఇక్కడ కలుగుతుంది. ఇయఱ్పా అనే మూడవ సహస్రంలో చరమశ్లోకార్థం, తిరువాయ్ మొళిలో ద్వయమంత్రార్థం అనుసంధింపబడినది అని, ఈ విధంగా నాలాయిర దివ్యప్రబంధం మొత్తం రహస్యత్రయవివరణ రూపమనే సమన్వయాన్ని కూడా మన పూర్వాచార్యులు చేశారు.

తిరువాయ్ మొళి ప్రబంధం ద్వయ మంత్రాన్ని వివరిస్తున్నది – అనే విషయం ఈడు మొదలైన వ్యాఖ్యానాలలో స్పష్టం చేయబడింది. నంబిళ్ళై ఈడువ్యాఖ్యానప్రవేశంలో తిరువాయ్ మొళిలోని మొదటి మూడు శతకాలు ద్వయమంత్రంలోని ఉత్తరవాక్యార్థాన్ని, తరువాత మూడు శతకాలు పూర్వవాక్యార్థాన్ని వివరిస్తున్నవి అని, మిగిలిన నాలుగు శతకాలు వాటి వివరణరూపాలే అని తెలిపారు. శ్రీ పిళ్ళైలోకాచార్యులవారు సారసంగ్రహం అనే రహస్య గ్రంథంలో తిరువాయ్ మొళి ప్రబంధం లోని పది శతకాలు రెండు వాక్యాలలోని పది అర్థాలను వివరిస్తున్నవి – అని తెలిపారు. ఆవి – శ్రియఃపతిత్వం, నారాయణత్వం, చరణారవిందయుగళం, పాపకత్వం, ప్రార్థనాగర్భవిస్రంభం, నిత్యసంబంధం, నిరతిశయభోగ్యత్వం, సర్వస్వామిత్వం, నిత్య కైంకర్యం, కైంకర్యంప్రతిబంధక నిశ్శేషనిబర్హణం – అనేవి ఆ పది అర్థాలు. ఈవిధంగా ద్వయమంత్రం లోని అర్థాన్ని తిరువాయ్ మొళి వివరిస్తున్నది – అని మన పూర్వాచార్యుల అభిప్రాయం.

భగవద్రామానుజవైభవాన్ని ప్రతిపాదించే ఇరామానుశ నూట్రందాది ప్రబంధం ద్వయమంత్రంలోని తత్త్వయాథాత్మ్యాన్ని నిరూపిస్తున్నది. అంటే – భగవానుని అనుసంధింపబడే ఆకారత్రయం చరమపర్వపర్యంతంగా అనుసంధింపబడాలనే విషయం ఆ ప్రబంధంలో నిరూపింపబడినది. ఆ ప్రబంధంలోని "పేఱొన్ఱు మట్రిల్లై నిన్ శరణన్ఱి అప్పేఱళిత్తఱ్కు ఆఱొన్ఱుమిల్లై మట్ర చ్చరణన్ఱి" (శ్రీరామానుజా!మీ చరణకైంకర్యం కంటే ఇంకొక ప్రాప్యం లేదు. దానిని పొందడానికి మీ చరణాల కంటే ఇంకొక

ఉపాయం లేదు) ఇత్యాది సూక్తులి విషయాన్ని తెలుపుతున్నాయి. అందుచేతనే తిరువాయ్ మొళి ప్రబంధాన్ని అనుసంధించిన పిమ్మట ఈ ప్రబంధం అనుసంధించడం జరుగుతున్నది. ఈ ప్రబంధం తిరువాయ్ మొళి ప్రబంధానికి సారమనికూడా పూర్వాచార్యుల ఉద్దేశ్యం. అందువల్లనే వేదం "శతాంకురా"(నూరు పాశురాలను కల ఇరామానుశ నూట్రందాదిని అంకురంగా కలిగినది) అని తిరువాయ్ మొళిని కీర్తించింది – అని అభిజ్ఞుల అభిప్రాయం

ఇయఱ్పా అనే మూడవసహస్రం చరమశ్లోకవివరణ రూపమన సమన్వయాన్ని ఈ క్రింది విధంగా భావించవచ్చు. ఈ సహస్రంలోని మొదటి ప్రబంధం అయిన ముదల్ తిరువన్దాదిలోని 59వ పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ పెరియవాచ్చాన్ పిళ్ళై "ఇదుక్కు కీళ్ ఎల్లామ్ షట్కత్రయత్తిల్ శొన్నవార్తైపోలే స్వరూప్ విశదమాకైక్కు చ్చొన్న నిలై, ఇదు చరమశ్లోఃత్తిల్ నిలైపోలే" (ఇంతకు ముందు పలికినది అంతా గీతలోని మూడు షట్కాలలో స్వరూపం విశదం కావడానికి చెప్పిన విషయంవంటిది, ఇది చరమశ్లోకంలోని విషయం వంటిది) అని పలుకడంవల్ల ఆ ప్రబంధం భగవద్గీతాసమమని, అందులోని 59 పాశురం చరమ శ్లోకరూపమని స్పష్టవుతున్నది. ఇయఱ్పాలోని నాన్ముకన్ తిరువందాది ప్రబంధంలోకూడా "అఫ్టోదియ వాక్కదనైక్కల్లాల్"అని72వ పాశురంలో చరమశ్లోకం ప్రసక్తమైనది. ఇయఱ్పాలోని పెరియ తిరువందాది ప్రబంధంలో చరమశ్లోకార్థం ఉపబృంహణం చేయబడిందని ఆచార్యహృదయసూక్తి. దీనిని శ్రీవరవరములు సప్రమాణంగా తమ వ్యాఖ్యానంలో వివరించారు. ఈ విధంగా ఈ సహస్రంలో చరమ శ్లోకం పునః పునః అభ్యాసం చేయబడినందున ఇది చరమశ్లోకస్థానీయంగా భావించవచ్చు.

అయితే ఇక్కడ ఒక సందేహం కలుగుతుంది. ముదలాయిరమ్, పెరియ తిరుమొళి అనే రెండు సహస్రాలు అష్టాక్షరిని, ఇయఱ్పా అనే మూడవ సహస్రం చరమశ్లోకాన్ని, చివరి సహస్రమైన తిరువాయ్ మొళి ప్రబంధం ద్వయాన్ని వివరిస్తున్నవి – అనే క్రమంలో అష్టాక్షరి, ద్వయం, చరమశ్లోకం – అనే క్రమానికి భంగం

కలుగుతున్నది కదా! అనేది ఆ సందేహం. అయితే, ఈ సందేహానికి అవకాశం లేదు. ఎందుకంటే – అష్టాక్షరి, ద్వయం, చరమశ్లోకం –అనే క్రమంవలె అష్టాక్షరి, చరమశ్లోకం, ద్వయం – అనే క్రమంకూడా పూర్వాచార్యసమ్మతమే.

పరన్దపడి, శ్రియఃపతి పడి, యాదృచ్ఛిక పడి అనే రహస్య గ్రంథాలలో శ్రీపిళ్ళై లోకాచార్యులవారు తిరు మంత్రం, చరమ శ్లోకం, ద్వయం – అనే క్రమాన్ని అనుసరించారు. ముముక్షుప్పడి అనే గ్రంథంలో అష్టాక్షరి, ద్వయం, చరమ శ్లోకం – అనే క్రమాన్ని అనుసరించారు. ఈ విధంగా ఉండే ఈ క్రమాలలోని సామంజస్యాన్ని వివరిస్తూ శ్రీ వరవరమునులు తమ వ్యాఖ్యానంలో – పూర్వం మూడు ప్రబంధాలలో పిళ్ళైలోకాచార్యులవారు తిరుమంత్రం తరువాత చరమశ్లోకాన్ని వివరించి, ఆ తర్వాత ద్వయాన్ని గూర్చి తెలిపారు. ఇప్పుడు చరమ శ్లోకంకంటే ముందుగా చరమ శ్లోకంకంటే ముందగా ద్వయాన్ని ఎందుకు వివరిస్తున్నారు? అని అంటే, ఈ రెండు క్రమాలలోను వివరించవచ్చు. అందువల్లనే పెరియ వాచ్చాన్ పిళ్ళై, వాదికేసరి జీయర్ మొదలైనవారు ఈ రెండు క్రమాలను అనుసరించారు. ఈ క్రమాలలోని భావం ఏమంటే – చరమ శ్లోకాన్ని ముందు, తరవాత ద్వయాన్ని వివరించే క్రమం విధి ముందు, అనుష్ఠానం తరువాత – అనే క్రమానికి అనుగుణం. ఇంతేకాక, తిరుమంత్రం ప్రాప్యపరం, చరమ శ్లోకం ప్రాపకపరం. ఈ రెండిటియొక్క అనుష్ఠాన ప్రతిపాదకం ద్వయం. అందువల్ల, తిరుమంత్రం, చరమ శ్లోకం, ద్వయం – అనే క్రమం అర్థవంతం. ఇక, అష్టాక్షరి, ద్వయం, చరమ శ్లోకం – అనే క్రమం వివరణ – వివరణిభావానికి అనుగుణం. తిరుమంత్రంలోని ద్వితీయ, తృతీయ పదాలను ద్వయంలోని పూర్వోత్తర వాక్యాలు వివరిస్తున్నాయి. ఈ రెండిటిని చరమశ్లోకంలోని పూర్వార్థ ఉత్తరార్థాలు వివరిస్తున్నాయి. ఈ విధంగా ఈ రెండు క్రమాలు అర్థవంతాలే. ప్రకృతంలో విధి – అనుష్ఠాన భావాన్ని అనుసరించి నాలుగు సహస్రాలలోని ప్రబంధాలు అష్టాక్షరి, చరమ శ్లోకం, ద్వయం – అనే క్రమంలో సమన్వయం చేయబడ్డాయని చెప్పాలి.

ఆళ్వారుల దివ్య ప్రబంధాలు రహస్యత్రయ వివరణరూపాలు – అనే ఈ క్రమాన్ని ఆ ప్రబంధాల అంగాంగిభావక్రమంలో కూడా సమన్వయం చేయవచ్చు. నమ్మాళ్వారుల ప్రబంధాలు నాలుగు రహస్య త్రయవివరణ రూపాలు – అని ఆచార్యహృదయమనే గ్రంథంలో నాయనార్ "ఇవట్రుక్కు మంత్రవిధ్యనుష్ఠానఙ్గళోడే శేర్ త్తి" అనే చూర్ణికలో(208) తెలిపారు. దీనిని శ్రీవరవరమునులు సప్రమాణంగా వ్యాఖ్యానించారు. ఈ క్రమంలో తిరువిరుత్తం, తిరువాశిరియమ్ అనే ప్రబంధాలు రెండు తిరుమంత్రాన్ని వివరించగా, పెరియ తిరువందాది చరమశ్లోకాన్ని, తిరువాయ్ మొళి ద్వయమంత్రాన్ని వివరిస్తున్నవి. దీని వివరణం ఆచార్యోపదేశగమ్యం. మిగిలిన ప్రబంధాలు నమ్మాళ్వార్ల ప్రబంధాలను వివరించే అంగ ప్రబంధాలు కనుక, నాలాయిరదివ్య ప్రబంధం అంతా రహస్యత్రయ వివరణాత్మకమనే సమన్వయం అర్ధవంతం.

**ఆళ్వారుల దివ్యప్రబంధాల అంగాంగిభావం**

"మాఱన్ పణిత్త తమిళ్ మఱైక్కు మంగైయర్ కోన్ ఆఱఙ్గమ్ కూఱ అవతరిత్త" అనే శ్రీ వరవరమునుల సూక్తిప్రకారం నమ్మాళ్వార్ల ప్రబంధాలు నాలుగు వేదాల వివరణరూపాలు కాగా, ఆ నాలుగు ప్రబంధాల వివరణరూపాలైన తిరుమంగై ఆళ్వారుల ఆరు ప్రబంధాలు ద్రావిడవేదషడంగాలుగా పూర్వాచార్యులు భావించారు. ఆ దృష్టిలో గమనిస్తే పెరియ తిరుమొళి ప్రబంధానికి ద్రావిడవేదాంగత్వం సిద్ధిస్తున్నది. నిశితంగా పరిశీలించి చూచినప్పుడు ఈ అంగాంగిభావాన్ని నిరూపించవచ్చు. నమ్మాళ్వారులు తిరువాయ్ మొళి ప్రబంధంలో "మడలూర్ దుమే"అని మడల్ ఎత్తుతానని అనగా, దానిని తిరుమంగై ఆళ్వార్లు పెరియ తిరుమడల్, శిఱియ తిరుమడల్ ప్రబంధాలలో వివరించారు. నమ్మాళ్వారులు "మిన్నిడై మడవార్" అనే దశకంలో పరాంకుశనాయకిగా భగవానునితో ప్రణయరోషంతో పలికినభావాన్ని "కాదల్ కడిప్పు" దశకంలో తిరుమంగై ఆళ్వారులు వివరించారు. నమ్మాళ్వారులు తిరువాయ్ మొళి ప్రబంధంలో "పయిలుమ్ శుడరొళి", నెడుమాఱ్కడిమై" అనే దశకాలలో పలికిన భాగవతశేషత్వపారతంత్ర్యాలను తిరుమంగై ఆళ్వారులు "నణ్ణాద", "కణ్ శోర" అనే

రెండు దశకాలలో అనుసంధించారు. ఇటువంటి ఇద్దరు ఆళ్వారుల ప్రబంధాల మధ్య ఉండే వివరణ వివరణిభావానికి సంబంధించిన అంశాలు ఇంకా చాలా ఉన్నాయి. వాటిని ఆచార్యహృదయంలో గమనించవచ్చు.

# దివ్య ప్రబంధాలు –వేదోపబృంహణాలు

ఆళ్వారుల దివ్య సూక్తులు వేదాలలోని తత్త్వాలనే కాక, వేదోపబృంహణాల అర్థాలను కూడా అనువదిస్తున్నాయి, ఈ విషయాన్ని పూర్వాచార్యులు తమ దివ్య ప్రబంధ వ్యాఖ్యానాలలో పలు చోట్ల సప్రమాణంగా నిరూపించారు. ఉదాహరణకు – శ్రీ రామాయణంలోని "పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్" అనే సూక్తిని పెరుమాళ్ తిరుమొళిలోని "కణ్డవర్ తమ్ మనమ్ వళజ్గమ్" అనే సూక్తి అనువదిస్తున్నది. శ్రీ విష్ణు పురాణంలోని"సదైకరూపరూపాయ" అనే సూక్తిలోని అర్థాన్ని తిరువాయ్ మొళిలోని "మాశూణా చ్చుడరుడమ్బాయ్ మలరాదు కువియాదు మాశూణా ఞానమాయ్" అనే సూక్తి అను సంధిస్తున్నది. భగవద్గీతలోని 18 అధ్యాయాలలో తెలుపబడిన తత్త్వాలు తిరువాయ్ మొళి ప్రబంధంలో అనుసంధింపబడిన విషయాన్ని ఆచార్యహృదయంలో నాయనార్ తెలియజేయగా, శ్రీవరవరమునులు ఆ అంశాన్ని తమ వ్యాఖ్యలో వివరంగా తెలిపారు. శ్రీ విష్ణుసహస్రనామస్తోత్రంలోని పలు నామాలలోని అర్థాలను ఆళ్వారుల సూక్తులలో దర్శించవచ్చు. "నారసింహవపుః శ్రీమాన్ " అనే నామంలోనిలోని అర్థాన్ని "అళకియాన్ తన్ అరియురువన్ తానే" అనే నాన్ముకన్ తిరువందాదిలోని సూక్తి స్మరిస్తున్నది. ఈ విధంగా పలు పురాణాలలోని పలు సూక్తులను ఆళ్వారుల దివ్య సూక్తులు అనువదించిన విశేషాలను పూర్వాచార్యులు తమ గ్రంథాలలో వేలాది సందర్భాలలో ఉదాహరించి చూపించారు. ఇవి అన్నీ సంస్కృతద్రావిడ వేదాంతాల ఐకమత్యాన్ని నిరూపిస్తున్నాయి. ఈ ఉభయవేదాంత సమన్వయ ప్రక్రియ శ్రీనాథమునుల నుండి ఆరంభమై, భగవద్రామానుజుల అనుగ్రహంతో అభివృద్ధమై, శ్రీదేశికులు, శ్రీవరవరమునులవంటి మహాచార్యుల సూక్తులలో మరింత పరిమళిస్తున్నది.

# వైద్యుడు, సహరోగులు

మనకు ఆరోగ్యం బాగా లేనప్పుడు వైద్యుని దగ్గరకు వెడతాము. ఆ వైద్యుడు మన అనారోగ్యాన్ని గుర్తించి, దానికి తగిన, మూలమైన కారణాలను తెలుసుకొని, ఆ రోగానికి తగిన మందును ఇస్తాడు. దానితో మన అనారోగ్యం తీరి, ఆరోగ్యం కలుగుతుంది. ఇది వైద్యుడు చేసే పని.

ఆ సమయంలోనే, ఈ విధమైన వ్యాధితోనే బాధపడే రోగులు కొంతమంది ఉంటారు. అందులో కొంతమంది రోగం తీరనివారు ఉంటారు, రోగం తీరి ఆరోగ్యాన్ని పొందినవారూ ఉంటారు. మనం వారితో సంభాషించినట్లయితే, మనకు ఒక నమ్మకం మనసులో కలుగుతుంది. వారితో మాట్లాడినందువల్ల మన వ్యాధి ఏదో తెలియకపోవచ్చు. మన వ్యాధికి తగిన మందు ఏదో వారు ఇవ్వలేకపోవచ్చు. కాని, మన వ్యాధిని గురించి వారితో మనం చెప్పుకున్నప్పుడు, వారు "నాకు కూడా ఇటువంటి రోగం వచ్చింది. దీనిని నయం చేసే వైద్యుడు ఇతడు" అని మనకు తెలియజేస్తారు కదా. అంతేకాకుండా, " నీవు ఏమి భయపడవద్దు. నాకు కూడా ఇటువంటి వ్యాధి వచ్చింది. ఇది తప్పక తగ్గుతుంది. నేను ఈ రోగం నయం కావడంకోసం ఈ రీతులలో చేశాను. అందువల్ల వ్యాధి నయం అయింది " అని అంటూ మనకు ధైర్యం తెలుపుతారు. మనలో నమ్మకాన్ని కలిగిస్తారు. మనలో ఉండే అధైర్యాన్ని తీరుస్తారు. ఇటువంటి స్థితి, అనారోగ్యం కలిగినప్పటికీ, మనసులో ధైర్యం కలిగినవారితో మాట్లాడినప్పుడు మనకు ఏర్పడుతుంది. ఈ విధంగా కాకుండా, కొంతమంది రోగులు చిన్న రోగానికే చాలా భయపడి బెదిరిపోతారు. అటువంటివారితో మాట్లాడి ప్రయోజనం లేదు. సరిగదా, మనకు లేని అధైర్యం కూడా కలుగుతుంది. అటువంటివారిని గురించి ఇక్కడ వస్తావించడం లేదు. ధైర్యం కలిగినవారు, వ్యాధి ఏదో గ్రహించినవారు, దానికి తగిన మందును ఇవ్వగలిగిన వైద్యుడు ఎవడో తెలిసినవారుఎవరో, అటువంటి సహరోగులను గురించే ఇక్కడ ప్రస్తావించడం జరిగింది.

ఈ విషయం అంతా ఇక్కడ ఎందుకు ప్రస్తావించడం జరిగిందంటే—

సంసారం అనేది ఒక పెద్ద వ్యాధి. ఇది జన్మమరణాల రూపంలో ఉండే మహావ్యాధి. మన మనసుకు, శరీరానికి ఏర్పడే ఎన్నెన్నో రోగాలు, క్లేశాలు కలుగుతాయి. వీటి అన్నిటి నుండి మనం బయటపడేటట్లు చేయగలిగిన వైద్యుడు ఎవరు? అతడు శ్రీమన్నారాయణుడే. "మరుత్తువనాయ్ నిన్ఱ మామణివణ్ణా!" (వైద్యుడువై ఉండే ఓ నీలమణివంటి వర్ణం కలిగిన స్వామీ!) అని మన సంసారం అనే వ్యాధిని తీర్చే సమర్ధుడైన వైద్యుడు భగవంతుడే— అని అంటారు, ఆళ్వారులు. " స్వామి నీవే నా సంసారం అనే రోగాన్ని తీర్చగలిగిన వైద్యుడవు. ఈ వ్యాధినుండి నన్ను రక్షించు" అని ప్రార్థిస్తారు. " తీర్ మరుందిన్ఱే" అని అంటూ ఈ సంసారం అనే వ్యాధికి ఈ లోకంలో సరి అయిన మందు లేదంటారు. " ఆర్ మరుందు ఇని ఆకువార్? " (ఇక సంసారమని వ్యాధికి మందుగా ఎవరు కాగలరు?) అని ప్రశ్నిస్తారు. దానికి సమాధానం తామే పలుకుతూ, భగవంతుడు తప్ప, ఈ వ్యాధిని తీర్చగలిగిన సమర్థుడైన వైద్యుడు ఇంకొకడు లేడని కూడా అంటారు. " శిక్కలిట్టు త్తిరుత్తు ఐవర్" అని అంటూ మనలను చిక్కులలో పెట్టి బాధ పెట్టేవి మన పంచేంద్రియాలే— అని అంటారు. ఇందువల్ల మన సంసారం అనే మహావ్యాధిని తీర్చేవాడు భగవంతుడు ఒక్కడే— అని అంటారు.

అయితే, ఇదే సమయంలో, బలమైన నమ్మకం కలిగిన, దృఢమైన మనసును కలిగిన సహరోగులు కూడా కొంతమంది ఉంటారుకదా. వారు, ఈ వ్యాధి నుండి బయటపడి ఆరోగ్యాన్ని పొందిన వారై ఉంటారు. సంసారం అనే వ్యాధినిగురించి మనం ఆలోచించినప్పుడు, ఈ విధంగా సంసారమనే వ్యాధినుండి బయటపడి స్వస్థతను పొందినవారు ఎవరంటే, ఆళ్వారులు, ఆచార్యులే. వారు అనుగ్రహించిన సూక్తుల వల్ల మనకి ఏమి ప్రయోజనం ఉన్నది? అని మనం సందేహించకూడదు. తప్పక చాలా ఫలం ఉన్నది. ఏ విధంగా సహరోగి "ఈ వైద్యుడే ఈ రోగానికి తగిన మందును ఇవ్వగలడు "అని మనకు తెలియజేస్తారో, ఆ విధంగానే వీరు కూడా మనకు "సంసారవ్యాధిని పూర్తిగా చికిత్స చేయగలిగిన వైద్యుడు భగవంతుడే" అని మనకు తెలుపుతారు. ఏ విధంగా

సహరోగి "ఈ రోగం మనలను ఈ ఈ రీతులలో బాధిస్తుంది" అని తెలియజేస్తారో, ఆ విధంగానే ఆళ్వారులు, ఆచార్యులు కూడా సంసారం అనే వ్యాధి వల్ల మనకు కలిగే కష్టనష్టాలను గూర్చి వివరించి తెలిపి, మనకు ధైర్యాన్ని కలిగిస్తారు. ఇంతే కాదు, " ఈ వ్యాధిని నేను పొందినప్పటికీ, నేను దీని నుండి బయటపడ్డాను. "అని వారు చెప్పినందువల్లనే కదా, మనకు ఒక సడలని ధైర్యం కలుగుతుంది. ఆ పనిని కదా, సహరోగులు చేస్తారు. ఆ విధంగానే, ఆళ్వారులు కూడా "భగవంతుడు ఈ సంసార రోగాన్ని తీరుస్తాడు, నాకు తీర్చాడు. నేను దీని నుండి బయటపడ్డాను. నాకు స్వస్థత కలిగింది" అని కూడా తెలుపుతారు.

ఇంతే కాదు, ఇంకొక ముఖ్యమైన విషయాన్ని కూడా సహరోగులు తెలుపుతారు. "ఈ వ్యాధి ఇంతకుముందు నాకు ఒకసారి వచ్చి తీరింది. కానీ, మళ్ళీ చేయకూడని ఇటువంటి అపథ్యాలను చేసినట్లయితే, మళ్లీ తిరిగి వచ్చే ప్రమాదం ఉన్నది సుమా! జాగ్రత్త! అటువంటి పనులను మాత్రం చేయవద్దు"– అని కూడా చెబుతారు. " ఇక మనకు భయం లేదు మనం ముక్తిని తరువాత పొందుదాం. ఇప్పుడు మనం ఇష్టం వచ్చినట్లు ఉండవచ్చు. అజాగ్రత్తగా ఉండవచ్చు. చేయకూడని పనులను చేసినా నష్టం లేదు–అని భావించకూడదు. ఆ విధంగానే, ఈ సంసారంలో ఉన్నంతకాలం మనం అజాగ్రత్తగా ఉన్నట్లయితే, ఆశించకూడని ప్రయోజనాలను ఆశించి, దేవతాంతరాలను ఆరాధించినట్లయితే, మళ్లీ తిరిగి ఈ సంసారం అనే వ్యాధికి గురి కావడం నిశ్చయం. జాగ్రత్త సుమా" అని కూడా ఆళ్వారులు, ఆచార్యులు తెలియజేస్తారు.

ఈ విధంగా ఒక వైపు వైద్యుని సహాయం, మరి ఒక వైపు ధైర్యాన్ని కలిగిన సహరోగులు చేసే సహాయం, ఆ విధంగానే, ఈ ఇటువంటి వ్యాధి నుండి బయటపడినవారు చెప్పే చక్కని ఉపదేశం– అనేవి అన్నీ మనకు లోకంలో ఉపయోగిస్తాయి. అదేవిధంగా, భగవంతుడు అనే వైద్యుడు సంసారం అనే మహావ్యాధిని పోగొడతాడు. ఆళ్వారులు, ఆచార్యులు అనే వీరు ఈ వ్యాధి తీరే ఉపాయాలను తెలిపి,

సరియైన వైద్యుని గూర్చి తెలిపి, వ్యాధి ఒకసారి వచ్చి తగ్గిన తరువాత కూడా ఏ విధంగా జాగ్రత్తగా ఉండాలో, ఆ విధానాలను కూడా తెలిపి, మనకు సహాయం చేస్తారు. అందువల్లనే వారి సూక్తులు, ఉపదేశాలు మనకు అవశ్యం సహాయపడతాయి. అందువల్లనే ఇవి చాలా ముఖ్యమైనవి. వీటిని మనం గ్రహించి, వీటి ప్రకారం నడచుకోవాలి. నడచుకుందాం. వారి విషయంలో కృతజ్ఞతా భావంతో ఉందాం. స్వస్తి.

## రూపం లేనివాడు చూపిన పలు రూపాలు

భగవంతుని మనం ఎన్నో రూపాలలో దర్శిస్తున్నాము. ఇవి ఒకటి రెండు కాదు, ఎన్నో రూపాలు. " పశ్య మే పార్థ! రూపాణి శతశోऽథ సహస్రశః" (అర్జునా! వేలాదిగా, వందలాదిగా ఉండే నా రూపాలను దర్శించు) అని శ్రీకృష్ణుడు భగవద్గీతలో అర్జునుని ఉద్దేశించి తన విశ్వరూపాన్ని అనుగ్రహించేటప్పుడు అన్నాడు. " వందలువేలాదిగా ఉండే నా రూపాలను, అర్జునా! దర్శించు" అన్నాడు. ఉపనిషత్తులు భగవంతుని రూపాన్ని చెప్పేటప్పుడు, "ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః" (ఆపాదమస్తకం బంగారు వర్ణంలో ఉండేవాడు) అని బంగారు వన్నెను కలిగిన, అందమైన రూపాన్ని కలవాడని, ఆళ్వారులు "కార్ మేగవణ్ణన్" (నల్లని మేఘంవర్ణంవంటి వర్ణం కలవాడు) అని ఈ విధంగా పలు విధాలుగా భగవంతుని రూపాలు వర్ణింపబడుతున్నాయి.

ఈ విధంగానే, భగవంతుడు ఒక విధంగా కంటికి కనిపించే రూపాన్ని లేనివాడుగాకూడా ఉన్నాడు. పలు విధాలైన రూపాలను కలిగినవాడై ఉండడం అనేది భగవంతుని ఒక ప్రకారం అయినట్లే, కంటికి కనిపించే రూపాన్ని లేకుండా ఉండడం కూడా భగవంతుని విధమైన ప్రకారమే. భగవంతుడు కంటికి కనిపించే రూపాన్ని లేకుండా ఉండడం అంటే ఏమి? దాని ఏదైనా ఒక నామం ఉన్నదా? కేశవః –అందమైన కేశాలను కలవాడు అనేది ఒక నామం. తామరైక్కణ్ణన్– తామరల వంటి నేత్రాలను కలవాడు అనేది ఒక నామం. ఆజానుబాహుః– మోకాళ్ళ వరకు సాగిన, పొడుగుగా ఉండే బాహువులను కలవాడు అనేది ఒక నామం, చతుర్భుజః– నాలుగు చేతులను కలవాడు అనేది ఒక నామం. ఈ విధంగానే, కంటికి గోచరించిఏ రూపం లేకుండా ఉన్నాడు– అనే అర్థం వచ్చే ఏదైనా ఒక పేరు ఏదైనా భగవంతునకు ఉన్నదా? రూపం లేనివాడని చెప్పవచ్చు, కానీ, అది ఒక నామం కాబోదు. కానీ ఆళ్వారులు ఆశ్చర్యకరంగా, ఆసక్తికరంగా భగవంతుని, కంటికి కనిపించే రూపం లేని ప్రకారాన్ని ఒక నామంతో నిర్దేశిస్తూ సంబోధిస్తున్నారు –" కట్కిలీ!" అని అంటూ. తిరువాయ్ మొழிప్రబంధంలోని ఏడవ శతకంలోని రెండవ దశకంనలోని నాల్గవ పాశురంలో.

ఈ దశకంలో నమ్మాళ్వారుల నాయికాభావం వ్యక్తమవుతున్నది. నాయిక మనస్సును తల్లి వ్యక్తం చేసే వచనాలుగా ఈ దశకంలోని పాశురాలు ఉన్నాయి. నాయిక ఏమీ చేయలేని దశలో ఉన్నది. ఈమె స్థితిని ఈమె తల్లి శ్రీరంగనాథుని సమక్షంలో విజ్ఞాపన చేస్తూ, " ఈమెను నువ్వు ఏమి చేయదలుచుకున్నావు? "అని ప్రశ్నిస్తున్నది.

ఈ పాశురంలో తల్లి, భగవంతుని కంటికి గోచరించే రూపం కలిగి ఉండే ప్రకారాన్ని, ఆ విధంగానే కన్నులకు గోచరించే రూపం లేని ప్రకారాన్ని కూడా వెంట వెంటనే నిర్దేశించి, " కట్కిలీ! ఉన్నై క్కాణుమాఱు అరుళాయ్, కాకుత్తా!కణ్ణనే! " (కంటికి కనిపించనివాడా! శ్రీరామా! శ్రీకృష్ణా! నిన్ను నేను దర్శించే రీతిని నాకు అనుగ్రహించు) అని పలుకుతున్నది. "కట్కిలి!" అనేది ఒక భగవన్నామం. అయితే ఇది యౌగిక పదం. కంటికి కనిపించనివాడు– అనేది దీని అర్థం. "కంటికి కనిపించనివాడా!" అనే అర్థం వచ్చే పదంలో భగవంతుని ఆళ్వార్లు సంబోధిస్తున్నారు. "కట్కిలి" అనే ఈ నామంలో అనే అర్థం ఏమి? " న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్" (ఎవ్వరూ ఈ భగవంతుని బాహ్యనేత్రాలతో దర్శించలేరు) అని వేదం తెలుపుతున్న అర్థమే.

"కంటికి కనిపించలేదు"– అనే కారణంలో ఒక వస్తువు లేదని చెప్పగలమా? లోకంలో ఉండే స్థితి ఏ విధంగా ఉన్నది? ఒక వస్తువు కంటికి కనిపించలేదు– అని అనుకోండి. ఆ వస్తువు లేదని కదా!, అంటున్నాము, భావిస్తున్నాము. ఆ విధంగానే, ఇక్కడ, భగవంతుని రూపం కంటికి కనిపించడం లేదు. కనుక, భగవంతుడు లేడు –అని చెప్పగలమా? చెప్పవచ్చునా? ఆ విధంగా చెప్పలేము, చెప్పకూడదు కూడా. కదా.

దీనికి ఒక ఉదాహరణను గమనిద్దాం. పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం– అనే ఐదు పంచభూతాలు ఉన్నాయి. వీటిలో వాయువునకు లక్షణాన్ని చెప్పేటప్పుడు, " రూపరహితస్పర్శవాన్ వాయుః" అనే లక్షణాన్ని లాక్షణికులు

చెబుతారు. వాయువు కంటికి కనిపించదు, కానీ, స్పర్శేంద్రియానికి గోచరిస్తుంది. వాయువు రూపరహితం— అని చెప్పినందువల్ల, రూపం లేదని తెలుస్తున్నది. ఆ విధంగానే, ఆకాశానికి కూడా రూపం లేదు. మిగిలిన మూడిటికి ఆ యా భూతానికి తగిన రూపం ఉన్నది. భూతాలు అయిదు అయినప్పటికీ, వీటిలో, పృథ్వి, జలం, అగ్ని అనే ఈ మూడింటికి రూపం ఉన్నది, వాయువు, ఆకాశం— అనే రెండిటికి రూపం లేదు. ఈ రెండింటికి రూపం లేదు అన్నంతమాత్రంచేత " ఇవి లేవు" అని చెప్పలేము. ఉన్నాయి, కానీ, అవి మన కంటికి కనిపించడం లేదు, అంతే. అవి మనసుకు గోచరిస్తాయికదా.

భగవంతుడు కంటికి కనిపించనివాడు కనుక, నమ్మాళ్వారులు "కట్కిలీ!" — కంటికి గోచరించనివాడా!— అని సంబోధించి పలికారు. , అంతటితో ఊరుకోకుండా, " ఉన్నై క్కాణుమాఱు అరుళాయ్!" (నిన్ను సేవించే ఉపాయాన్ని అనుగ్రహించు) "కంటికి కనిపించని నిన్ను నేను చూడగలిగేటట్టుగా అనుగ్రహించాలి" అని ప్రార్థించారు.

భగవంతుడు వెంటనే నవ్వుతూ "ఆళ్వార్లూ! నన్ను మీరు "కట్కిలీ!" అని అంటూ, కంటికి కనిపించనివాడని అన్నారు కదా! మళ్లీ, నన్ను మీ కంటికి కనిపించేటట్లు అనుగ్రహించమని అంటున్నారే! ఇది సంభవించే అవకాశం ఉన్నదా? ఎప్పుడైనా జరిగిందా? " అని అడిగాడు. వెంటనే ఆళ్వార్లు "అరుళాయ్!" (అనుగ్రహించు) నీవు అనుగ్రహించాలని అనుకుంటే, అది అసంభవం ఏమీ కాదు కదా" అని అన్నారు. వెంటనే భగవంతుడు మళ్లీ "ఈ విధంగా, నేను ఎప్పుడైనా అందరి కంటికి కనిపించేటట్లుగా అయ్యానా? చెప్పండి. " అన్నాడు. అప్పుడు దానికి సమాధానంగా ఆళ్వార్లు "కాకుత్తా! కణ్ణనే!" అని అన్నారు. శ్రీరాముడవై అవతరించి, " రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్" అన్నట్లు, చూచే వారి నేత్రాలను, మనస్సులను కొల్లగొట్టే రూపాన్ని, గుణాలను కలిగిన శ్రీరాముడవై రాలేదా! " తాసా మావిరభూత్ శౌరిః స్మయమానముఖాంబుజః, పీతాంబరధరః స్రగ్వీ సాక్షాన్మన్మథమన్మథః" అనే విధంగా రాసక్రీడమధ్యలో, మన్మధుడు కూడా బిచ్చమెత్తే రీతిలోని అందంతో గోపికలకు నీవు

సాక్షాత్కరించలేదా! ఇందుచేత, శ్రీకృష్ణుడవై సాక్షాత్కరించవచ్చు, శ్రీరాముడవై సాక్షాత్కరించవచ్చు. అయోధ్యాపురవాసులకు శ్రీరాముడవై దర్శనమిచ్చినవాడవు, రేపల్లెలోని గోపికలకు శ్రీకృష్ణుడవై దర్శనమిచ్చినవాడవు, నీవు అనుగ్రహించాలని అనుకుంటే, నాకు నీ దివ్యరూపంతో సాక్షాత్కరించలేవా? నా కంటికి గోచరించవచ్చు కదా!" అని అంటూ నమ్మాళ్వార్లు చాలా అందమైన పాశురంలో ప్రార్థించారు. వారి ప్రార్థనను మన్నించి, భగవంతుడు, వారికి మాత్రమే తన దివ్యరూపాన్ని సాక్షాత్కరింపజేయడం కాకుండా, ఆ ఆళ్వారుల అనుగ్రహం చేత, ఈనాటికీ మనకు ఎన్నో దివ్యదేశాలలో తన దివ్య రూపంతో మనలను అనుగ్రహిస్తున్నాడు. ఇటువంటి అపూర్వమైన అదృష్టాన్ని మనకు కలిగించిన ఆళ్వారులకు మనం సదా కృతజ్ఞతలను సమర్పించుకుందాం. స్వస్తి.

## తాటక మారీచ సుబాహుల నిరసనంలోని వేదాంతతత్త్వం

శ్రీరామాయణంలోని కొన్ని ముఖ్యమైన శ్లోకాలకు పెరియ వాచ్చాన్ పిళ్ళై అనే ఆచార్యవర్యులు చాలా విశదమైన, విలక్షణమైన వ్యాఖ్యానాన్ని" శ్రీరామాయణ తనిశ్లోకమ్" అనే పేరుతో అనుగ్రహించారు. ఆ గ్రంథంలోని ప్రతి శ్లోకానికి చాలా లోతైన అర్థాలను వారు వివరించారు శ్రీరాముడు తాటకను సంహరించాడు. తాటక కుమారులైన మారీచ సుబాహులు అనే ఇద్దరు రాక్షసులు విశ్వామిత్రుని యాగాన్ని పాడు చేయడానికి రాగా, వారిద్దరిని నిరసించాడు. వారిద్దరిలోకూడా, సుబాహుని సంహరించి, మారీచుని దూరంగా తరిమికొట్టాడు. ఈ వృత్తాంతాన్ని పై పైన గమనిస్తే, శ్రీరాముడు ఒక రాజకుమారుడు, తాటక ఒక రాక్షసి, మారీచ సుబాహులు కూడా ఇద్దరు రాక్షసులు, వారిని శ్రీరాముడు సంహరించాడు—అనే విషయమే మనకు గోచరిస్తుంది. అయితే, జీవులమైన మనలను దృష్టిలో పెట్టుకొని ఈ కథను గమనించినప్పుడు, "ఈ విధమైన వేదాంతతత్త్వం మనకు ఇందులో గోచరిస్తుంది" అని వ్యాఖ్యాత పెరియవాచ్చాన్ పిళ్ళై తెలియజేస్తున్నారు.

విశ్వామిత్రుడు శ్రీరాముని, లక్ష్మణుని పురస్కరించుకొని తాటకను సంహరింప చేశాడు— అనే ఈ వృత్తాంతం ఏ విధంగా కనపడుతుంది? అని అంటే, కర్మయోగం ద్వారా, జ్ఞానయోగం ద్వారా అవిద్యను నశింప చేసికోవడం— అనే తత్త్వమే ఇక్కడ కనబడుతుంది —అని అంటారు, వ్యాఖ్యాత. అవిద్య అంటే— ఆత్మ పరమాత్మల జ్ఞానం లేకపోవడం. జీవాత్మ స్వరూపం పరమాత్మ స్వరూపం, అచేతన తత్త్వ స్వరూపం —అనే మూడు విధాలయిన తత్త్వాల స్వరూపాన్ని తెలుసుకుంటే, సరి అయిన విద్య, అంటే, జ్ఞానం లభిస్తుంది. విద్య అనే పదంతో ఉపాసనాన్నికూడా నిర్దేశించడం ఉన్నది. సరి అయిన తత్త్వత్రయ జ్ఞానం లేకపోయినట్లయితే, మనం ఎవరం?, మనం ఏమి చేయాలి?, మన లక్ష్యం ఏమి?, దానికి మార్గం ఏమి?, మనం ఎటువంటి ప్రయోజనాన్ని పొందాలి? — అనే విషయాలను తెలియడం సాధ్యం కాదు. మన లక్ష్యం ఏమో మనకు

స్పష్టంగా తెలియకపోతే, మనం నడిచే నడత కూడా సరిగా ఉండదు. నడిచే దారి సరిగా లేకపోతే, మనం మంచి పని చేస్తున్నామా? లేక, చేయకూడని పనిని చేస్తున్నామా? అనే విషయం కూడా మనకు అర్థం కాదు. అందువల్ల, ఆత్మజ్ఞానం లేకపోవడమే అవిద్య. ఈ అవిద్య వల్ల మనం దేనిని పొందాలి? అనే లక్ష్యాన్ని కూడా తెలిసికోలేక పోతాము. అందుచేత మనం నడిచే మార్గం తప్పు దారి అవుతుంది. అందువల్ల, మనం ఈ జన్మలో ఏమి చేస్తున్నామో తెలియలేక, పుణ్యమని భావించి పాపాలనే చేస్తాము.

మరి ఈ సమస్యను ఏ విధంగా పరిష్కరించుకోవడం? అంటే, దీనికి అంతటికి మూలమైన అవిద్యను తొలగించుకోవాలి. అవిద్యను లేకుండా చేసుకోవాలంటే, ముఖ్యంగా రెండు కావాలి. అవి— జ్ఞానం, కర్మ అనే రెండు. అంటే, సరి అయిన జ్ఞానం, దానికి అనుగుణమైన అనుష్ఠానం— అనే రెండు ఉండాలి. అందుచేత, జ్ఞానమూ కావాలి, జ్ఞానానికి తగిన ఆచరణా ఉండాలి. వీనినే జ్ఞానయోగమని, కర్మయోగమని అంటున్నాము. ఈ రెండిటినీ చేయగా, చేయగా, అవిద్య తొలగిపోతోంది, అంటే, ఆత్మ జ్ఞానం లేకపోవడం అనేది లేకుండా పోతుంది యథార్థజ్ఞానం కలుగుతుంది. ఆత్మజ్ఞానం కలిగే కొద్దీ పాపపుణ్యాల స్వరూపాన్ని తెలుసుకోగలుగుతాం. పాపాలను చేయడం మానేస్తాం. పాపాలను చేయకూడదు, కానీ, పుణ్యాలను చేయాలి. పుణ్యాలను చేసినప్పటికీ కూడా, వాటి వల్ల కలిగే ఫలాన్ని కోరకుండా చేయాలి. వాటి ప్రయోజనాలను అన్నిటిని "సర్వం శ్రీకృష్ణార్పణమస్తు" అని భగవంతుని సన్నిధిలో సమర్పించాలి. దీనినే శ్రీరాముడు ఆచరించి చూపించాడు. అందుచేత, శ్రీరాముని జ్ఞానయోగంగాను, లక్ష్మణుని కర్మయోగంగాను, అంటే, అనుష్ఠానంగానూ భావించాలి.

శ్రీరామ లక్ష్మణులను పురస్కరించుకునే విశ్వామిత్రుడు తాటకను నిరసింప చేశాడు. తాటక అంటే —అవిద్య కదా. అంటే, జ్ఞానరాహిత్యం. తాటక వల్ల పుట్టినవారు —మారీచ సుబాహులు. అంటే, పుణ్య పాపాలు అనే రెండు. శ్రీరాముడు సుబాహుని సంహరించాడు, మారీచుని దూరంగా తరిమికొట్టాడు. ఈ విధంగానే, మనం పాపాలను

లేకుండా చేసుకోవాలి. పుణ్యాలను చేసినప్పటికీ, వాటి ఫలం మనకు చెందకుండా దూరం చేసుకోవాలి. శ్రీరాముడు మారీచుని సంహరించలేదు, దూరంగా తరిమి కొట్టాడు. ఆ విధంగానే, మనం పుణ్యకార్యాలను చేయాలి, వాటి ఫలాలనుమాత్రం విడచి పెట్టాలి.

ఏం? పుణ్యఫలాలను అనుభవిస్తే ఏమవుతుంది? అని అంటే, అవి మళ్లీ మనలను ఈ లోకంలో జన్మించేటట్లు చేస్తాయి. అవి ఈ లోకాన్నే కాదు, స్వర్గాన్ని కూడా పొందేటట్టు చేయవచ్చు. కానీ, మన లక్ష్యం స్వర్గాన్ని చేరడం కాదు కదా. పునరావృత్తి లేని వైకుంఠానికి చేరడం కదా, మన లక్ష్యం.

తాటకను సంహరించగానే, ఆమెకు పుట్టిన సంతానం మారీచ సుబాహులు, తమను కాపాడే తల్లి నశించగానే, వారుకూడా లేకుండా పోయారు. ఆ విధంగానే, అవిద్య నశించి పోతే, దానిని ఆశ్రయించుకుని ఉండే పుణ్య పాపాలనే రెండు తామే స్వయంగా లేకుండా పోతాయి. అవిద్య నశించినందున, దానివల్ల ఆత్మజ్ఞానం ఏర్పడినందున పాపాలను చేయడం మానివేయవచ్చు. పుణ్య కార్యాలను చేసినప్పటికీ, వాటి ఫలాన్ని పరమాత్మ సన్నిధిలో సమర్పించవచ్చు.

ఈ తత్వమే విశ్వామిత్రుడు శ్రీరామలక్ష్మణులను పురస్కరించుకొని తాటకను సంహరించడంలో, తాటక నశించగానే ఆమె కుమారులు ఆయన మారీచ సుబాహులను లేకుండా చేయడంలో, వారిలో కూడా, సుబాహుని వధించడంలో, మారీచుని దూరంగా తరిమి కొట్టడంలో వ్యక్తమవుతున్నది. ఆ విధంగానే, మనం కూడా, కర్మజ్ఞానాలతో అవిద్యను లేకుండా చేసికొని, ఆ అవిద్య వల్ల, అంటే, జ్ఞానం లేకపోవడం వల్ల ఏర్పడిన పాపపుణ్యాలను లేకుండా చేసికోవాలి. వాటిలో కూడా, పాపాలను నశింపజేసికోవాలి. పుణ్యం చేసినప్పటికీ పుణ్యఫలాలను మనకు అంటకుండా చేసుకోవాలి. ఈ వేదాంత తత్వమే మనకు ఇక్కడ ఈ వృత్తాంతంవల్ల బోధపడుతున్నది —అని పరమ కారుణికులైన వ్యాఖ్యాత పెరియ వాచ్చాన్ పిళ్ళై మనకు తెలియజేశారు.

మనం కూడా ఈ తత్త్వాన్ని అర్థం చేసికొని, మనసులో నిలుపుకొని, ఆ విధంగా ఆచరించి తరిద్దాం. మనకు ఈ మహార్థాన్ని ఉపదేశించిన ఈ మహాచార్యుపట్ల కృతజ్ఞులమై ఉందాం.

# గోదాదేవి – శ్రీరామాయణ పురుషులు

★★★★

ఆండాళ్ నాచ్చియార్ అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధానికి వ్యాఖ్యాన చక్రవర్తి పెరియ వాచ్చాన్ పిళ్లై, అழకియ మణవాళ పెరుమాళ్ నాయనార్, జనన్యాచార్యులు అనే పూర్వాచార్యులు ముగ్గురు వ్యాఖ్యానాలను అనుగ్రహించారు. ఆ వ్యాఖ్యానాలలో వారు, శ్రీరామాయణంలో ఉండే పలు శ్లోకాలను ఉదాహరించి, తిరుప్పావై ప్రబంధానికి శ్రీరామాయణానికి మధ్య ఉండే సామ్యాలను కొన్ని సందర్భాలలో, శ్రీరామాయణం కంటే తిరుప్పావై ప్రబంధానికి కల అతిశయాన్ని మరికొన్ని సందర్భాలలో వివరించారు.

"ఆయ్" అనే పేరు కలిగిన జనన్యాచార్యులు తమ వ్యాఖ్యానంలో ఆళ్వార్లకు, గోదాదేవికి, ఆ విధంగానే, శ్రీరామాయణ పురుషులైన లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు మధ్య ఉండే సామ్యాలను చాలా అందంగా వివరించారు. ఆ వివరణలో వారు –లక్ష్మణ స్వామి రీతివంటిది మిగిలిన ఆళ్వారులు అందరి రీతి. భరతుని రీతి పెరియాళ్వారుల రీతివంటిది, . శత్రుఘ్నుని రీతి గోదాదేవిరీతివంటిది– అని అన్నారు.

శ్రీరాముడు అరణ్యాలకు వెళ్ళేటప్పుడు లక్ష్మణుడు "నేను కూడా నీ వెంట వస్తాను" అని నిర్బంధించి, శ్రీరామునితో అరణ్యాలకు వెళ్ళి, అన్ని విధాలైన కైంకర్యాలను ఆ స్వామికి చేశాడు చేశాడు. " రాజ్యం చ తవ రక్షేయ మహం వేలేవ సాగరమ్" (సముద్రతీరం సముద్రాన్ని రక్షించినట్లుగా నేను నీ రాజ్యాన్ని రక్షిస్తాను), " ప్రతిజానామి తే వీర !మాభూవం వీరలోకభాక్" అని అంటూ శ్రీరాముని నిర్బంధించి, ఆ స్వామివెంట వెళ్ళి, లక్ష్మణుడు సేవలను చేశాడు. ఇటువంటి లక్ష్మణుని రీతి ఆళ్వారుల రీతి. వారు, లక్ష్మణుని వలె, భగవంతుని ప్రార్థించి, నిర్బంధించి అనుభవించాలని ప్రయత్నం చేశారు. వారికి శేషత్వమే తప్ప, పారతంత్ర్యం లేదా? అని అంటే, లేకపోలేదు కానీ, దానికంటే శేషత్వమే ఎక్కువగా వారిలో భాసించింది. భగవంతుని ఏ విధంగానైనా తాము

అనుభవించాలి– అనే ఆశ అనేది వారికి కల భక్తివల్ల మిక్కిలిగా ఉన్నది. అది పారతంత్ర్యాన్ని మించి ఉన్నది. అందువల్ల వారి స్థితి లక్ష్మణుని స్థితి వలె ఉన్నది.

ఆ విధంగానే, భరతుని రీతివంటిది పెరియాళ్వారుల రీతి. భరతుడు, లక్ష్మణునివలె తాను ఆశించిన సేవను శ్రీరామునకు చేయాలని కోరకుండా, ఆ శ్రీరాముడు మెచ్చిన సేవనే చేయాలని ప్రయత్నం చేశాడు. అందుచేత, "శేషి మెచ్చిన సేవను చేయడం" అనే పారతంత్ర్య భావనను భరతుడు కలిగి ఉన్నాడు. తాను కోరిన విధంగా శ్రీరాముడు అయోధ్యకు తిరిగి రాకపోయినా, ఆ శ్రీరాముడు చెప్పిన విధంగా పాదుకలను గ్రహించి, " ఆరురోహ రథం హృష్టః " (ఆనందంగా రథాన్ని భరతుడు ఎక్కాడు) అని ఆనందంగా అయోధ్యకు తిరిగి వెళ్ళాడు. –అని కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధ వ్యాఖ్యానంలో వ్యాఖ్యాన చక్రవర్తి అనుగ్రహిస్తారు. శ్రీరాముడు అయోధ్యకు తిరిగి వచ్చి, రాజ్యాన్ని పాలించాలి– అని ఆశించాడు, భరతుడు. కానీ శ్రీరాముని అభిప్రాయం వేరుగా ఉన్నది. ఆ అభిప్రాయానికి తగినట్లుగానే, భరతుడు శ్రీరాముడు అయోధ్యకు తిరిగి రాకపోయినా, అతడు అనుగ్రహించిన పాదుకలను గ్రహించి, ఆనందంగానే అయోధ్యకు తిరిగి వచ్చాడు. ఆ విధంగానే పెరియాల్వార్లు కూడా, తాము కోరిన సేవను భగవంతునకు చేయడం కాకుండా, భగవంతుని సమృద్ధికోసం మంగళాశాసనం చేశారు. "పొంగుమ్ పరివాలే" అని శ్రీ వరవరమునులు ఉపదేశ రత్తినమాలై ప్రబంధంలో పలికినట్లుగా, పొంగి పొర్లే ప్రేమతో భగవంతునకు మంగళాశాసనం చేశారు. ఇది భరతుని రీతియే కదా. అందుచేత పెరియాళ్వారుల రీతి భరతుని రీతి వంటిది.

భరతుడు ఈ విధంగా భగవంతుని విషయంలో పారతంత్ర్యాన్ని ఆచరించాడు. కానీ, శత్రుఘ్నుడు మాత్రం, ఆ భగవంత్పారతంత్ర్యానికి అవధి అయిన భాగవత పారతంత్ర్యాన్ని ఆచరించి చూపించాడు. దానికి ఉత్తమోదాహరణంగా నిలిచాడు. ఈ విషయాన్ని శ్రీరామాయణంలో అయోధ్యాకాండ ఆరంభంలో ఉండే "గచ్ఛతా మాతులకులం భరతేన తదానఘః, శత్రుఘ్నో నిత్య శత్రుఘ్నో నీతః ప్రీతి పురస్కృతః"

(అప్పుడు, తన మేనమామ ఇంటికి వెళ్లే భరతునిచేత నిత్యం శత్రువులను జయించినవాడైన ఆ శత్రుఘ్నుడు ప్రీతితో వెంట తీసుకుని పోబడ్డాడు) అనే సూక్తి తెలుపుతున్నది. ఒక అచేతనమైన పరికరాన్ని చేతితో తీసికొని పోయినట్లుగా, శత్రుఘ్నుని భరతుడు తన వెంట తీసుకొని పోయాడు. – అని అంటూ సరసంగా ఇక్కడ ఈ శ్లోకాన్ని పెరియ వాచ్చాన్ పిళ్ళై కణ్ణినుణ్ శిఋత్తాంబు ప్రబంధ వ్యాఖ్యానంలో వివరించారు. ఒక ద్రవ్యం, ఇంకొక ద్రవ్యంతో కలసినట్లుగా కాకుండా, ఒక గుణం ఒక ద్రవ్యంతో కలసి ఉండేటట్లుగా, శత్రుఘ్నుడు భరతునితో అత్యంతపారతంత్ర్యాన్ని కలిగినవాడై, అతనితో కలసి, అతనివెంట వెంట వెళ్లాడు– అనికూడా అక్కడ వారు వ్యాఖ్యానించారు. గోదాదేవి కూడా, ఈ విధంగానే భాగవత పారతంత్ర్య పరాకాష్ఠను కలిగినది. ఈమె భాగవతులను పురస్కరించుకొని, భగవంతుని ఆశ్రయించడానికీ ప్రయత్నించినది. " మెయ్ మ్మై పెరు వార్తై విట్టుశిత్తర్ కేట్టిరుప్పర్" (శ్రీకృష్ణ భగవానుడు పలికిన యథార్థమైన చరమశ్లోకాన్ని విష్ణుచిత్తులు తెలుసుకొని, అందులో స్థిరమైన విశ్వాసాన్ని కలిగి ఉన్నారు) అనే విధంగా పెరియాళ్వారులు శ్రీకృష్ణుడు అనుగ్రహించిన చరమ శ్లోకంలోని అర్థంలో స్థిరమైన నిష్టను కలిగి ఉన్నారు. కానీ, గోదాదేవి, ఆ విధంగా ప్రథమ పర్వలోనిష్ఠను కలిగినది కాకుండా " విట్టుశిత్తర్ తంగళ్ దేవరై వల్లపరిశు వరువిప్పరేల్ అదు కాండమే" (విష్ణుచిత్తులు తమ ప్రభువైన భగవంతుని తగిన ఉపాయంతో మనకు సాక్షాత్కరింప చేసినట్లయితే, అప్పుడు ఆ స్వామిని దర్శిస్తాము) అనే విధంగా తనకు ఆచార్యులైన విష్ణుచిత్తుల అనుగ్రహాన్ని, అభిమానాన్ని ఉపాయంగా భావించిన చరమ పర్వనిష్ఠురాలు కదా. ఆచార్యపురుషకారాన్ని పురస్కరించుకుని భగవంతుని ఆశ్రయించడం అనే దశలో గోదాదేవి స్థిరమైన నిష్ఠను కలిగినది. " శెల్వర్ పెరియర్, శిఋమానిడవర్, నామ్ శెయ్ వదెన్? (లక్ష్మీనాథుడైన భగవంతుడు చాలా గొప్పవాడు. మనం చాలా చిన్నవారమైన మానవులం. మనమేమి చేయగలము?) అనే విధంగా భగవంతుడు పర్వతంవంటివాడు. మనం చాలా చిన్న అణువులాంటివారం. మనం ఆ స్వామిని ఏ విధంగా ఆశ్రయించగలం? అని అంటే, దానికి ఒక చక్కని మార్గం ఉన్నది. "విట్టుశిత్తర్ తంగళ్ దేవరై " అనే విధంగా భగవంతుడు

విష్ణుచిత్తులకు పరతంత్రుడు. వారు "మంజనమాడ నీవారాయ్" (స్వామీ" స్నానం చేయడానికి రా!") అని పిలిస్తే భగవంతుడు వారి దగ్గరకు తప్పక వస్తాడు. పువ్వులను ముడుచుకోవడానికి రమ్మంటే వస్తాడు. రక్ష పెడతాను, రమ్మంటే వస్తాడు. అటువంటి విష్ణుచిత్తులకు పరతంత్రుడైన భగవంతుని మనం వారి ద్వారా వారి పురుషకారంతో ఆశ్రయించవచ్చు"– అని గోదాదేవి ఆచార్య పురుషకార పూర్వకంగా భగవంతుని ఆశ్రయించవచ్చునని అన్నది. అందుచేత, గోదాదేవి రీతి శత్రుఘ్నుని రీతివంటిది. "శత్రుఘ్నుడు శ్రీరామునకు ఎందుకు ఇష్టమైనవాడు అంటే, తనకు ఇష్టమైన భరతుని తప్ప వేరొకనిని ఎవరిని అతడు తెలియనివాడు కనుక" అని శ్రీ రామానుజులు అనేవారట.

గోదాదేవి రీతి కేవలం శత్రుఘ్నుని రీతివంటిదేనా? అని అంటే, తిరువాయ్ మొ*ழி* ప్రబంధం ఈడు వ్యాఖ్యానంలో నంబిళ్ళై నమ్మాళ్వార్లు ఒక్కొక్క రీతిలో లక్ష్మణునివలె, ఒక్కొక్క రీతిలో భరతునివలె, ఒక్క రీతిలో శత్రుఘ్నుని వలె, ఒక్కొక్క రీతిలో సీతాదేవి వలె గోచరిస్తారు– అని చెప్పినట్లుగానే, గోదాదేవి కూడా ఒక్కొక్క రీతిలో చూస్తే లక్ష్మణుని వలె కూడా సాక్షాత్కరిస్తుంది. భరతుని రీతి కూడా ఆమెలో కనిపిస్తుంది, సీతాదేవి రీతి కూడా ఆమెలో కనిపిస్తుంది–అని తిరుప్పావై వ్యాఖ్యానావతారికలో పూర్వాచార్యులు అంటారు. గోదాదేవి అవతరించింది ఏ విధంగా? అంటే సహజమైన భక్తిలోనే ఆమె అవతరించింది –అని అంటారు, వ్యాఖ్యాన చక్రవర్తి, జనన్యాచార్యులు కూడా. , మిగిలిన ఆళ్వారులు అయితే, "మయర్వఱ మదినలమ్ అరుళినన్ " అని భగవదనుగ్రహం వల్ల పొందిన జ్ఞానభక్తులను కలవారు. పెరియాళ్వారులకు పుత్రిక అయినందున, ఆమె సహజంగా స్త్రీ అయినందువల్ల, పురుషుని విషయంలో స్త్రీకి ప్రీతి కలగడం అనేది సహజ సిద్ధం కనుక, భూదేవి అంశతో అవతరించినది కనుక, గోదాదేవికి కల జ్ఞాన భక్తులు సహజ సిద్ధమైనవి– అని, అందువల్ల ఈమె ఏ విధంగా ఉన్నది? అంటే, లక్ష్మణ స్వామివలె ఉన్నది –అని ఈ వ్యాఖ్యాతలు అంటారు. దీనిని వివరించడానికి వారు శ్రీరామాయణంలోని "బాల్యాత్

ప్రభృతి సుస్నిగ్ధో లక్ష్మణో లక్ష్మివర్ధనః, రామస్య లోకరామస్య భ్రాతుః జ్యేష్ఠస్య నిత్యశః" (బాలకాండం– 18 –27) అనే సూక్తిని ఉదాహరించారు. ఈ శ్లోకంలో "బాల్యాత్ ప్రభృతి సుస్నిగ్ధః" –అని అంటూ చాలా చిన్న వయస్సు నుండే లక్ష్మణుడు శ్రీరాముని విషయంలో చాలా ప్రీతిని కలిగి ఉండేవాడు– అని చెప్పబడింది. ఇక్కడ, రామాయణవ్యాఖ్యాత గోవిందరాజులు "లక్ష్మీం వర్ధయతీతి లక్ష్మీవర్తనః"– సంపదను అభివృద్ధి చేసేవాడు– అని "లక్ష్మివర్ధనః, " అనే పదాన్ని వివరించారు ఇక్కడ చెప్పబడిన సంపద ఏమి? అని అంటే, " కైంకర్య సంపద్వర్ధకః" (భగవంతుని కైంకర్యం అనే సంపదను వృద్ధి చేసేవారు) అని వారే వివరించారు. ఆ విధంగానే, లక్ష్మణుడు, శ్రీరామునకు అన్ని విధాలయిన కైంకర్యాలను నిరంతరంగా చేసినట్లు మనం తెలుసుకుంటున్నాము. అది కూడా, తొట్టిలో పరుండి ఉండే ప్రాయంనుండే– అని కూడా చెప్పబడింది. " లక్ష్మణో లక్ష్మిసంపన్నో బహిః ప్రాణ ఇవాపరః, న, చ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః" అనే విధంగా లక్ష్మణుడు పక్కన లేకపోతే శ్రీరామునకు నిద్ర పట్టేది కాదు– అని చెప్పబడింది. " సుస్నిగ్ధః" అనే పదాన్ని చాలా అద్భుతంగా గోవిందరాజులు వ్యాఖ్యానించారు. " అంకురాత్ ప్రభృతి పరిమళేనేవోత్పన్నః తులసీకాండ ఇవ, జన్మనః ప్రభృతి నిరవధిక భక్తిసంపన్నః" (విత్తనంగా ఉండే సమయంనుండే పరిమళంతోనే పుట్టిన తులసీకాండం వలె, పుట్టిన సమయంనుండే అంతు లేని భక్తి సంపదను కలవాడు, లక్ష్మణుడు) అని వారు వివరించారు. ఆ విధంగానే, తిరుప్పావై వ్యాఖ్యానంలో వ్యాఖ్యాతలు, పుట్టినప్పుడే పరిమళంతో పుట్టే తులసి వలె పుట్టిన సమయం నుండే గోదాదేవి జ్ఞాన భక్తులను కలిగి అవతరించింది– అని అన్నారు. అందుచేత, లక్ష్మణ స్వామి రీతి కూడా ఒక విధంగా గోదాదేవికి ఉన్నది– అని ఏర్పడుతున్నది.

ఇంతేకాక, జనన్యాచార్యులవారి నాలాయిరప్పడి వ్యాఖ్యానంలో " జనకరాజన్ తిరుమకళుడైయ ఆఱ్ఱామై ప్పఙంద పాశురంగళ్ చక్రవర్తి త్తిరుమగనై పెఱుగైక్కుడలాయ్ విళ్ణ్దాప్పోలే, ఆండాళుడైయ ఆఱ్ఱామై ప్పఙంద పాశురంగళ్

పెరియపెరుమాళ్ తిరువడిగళై ప్రాపిక్కైక్కుక్కడలాయ్ విగ్రున్దదు" అని చెప్పబడింది. సీతాదేవి శ్రీరాముని విశ్లేషించిన దుఃఖం చేత పలు వచనాలను పలికినది. అవి అన్నీ తిరిగి ఆ శ్రీరాముని పొందడానికి కారణమయ్యాయి. ఆ విధంగానే, గోదాదేవి భగవంతుని పొందాలనే ఆర్తితో పలికిన సూక్తులు అన్నీ శ్రీరంగనాథుని శ్రీ చరణాలను పొందడానికి కారణమయ్యాయి. శ్రీకృష్ణుని పొందాలని ఆశపడి, నోము నోచడం– అనే ఒక వ్యాజాన్ని పెట్టుకొని, గోదాదేవి, "భగవంతుని చేరాలి "అనే ఉద్దేశంతో పలికిన పాశురాలు అన్నీ, ఆ శ్రీకృష్ణుని పొందడానికి హేతువులయ్యాయి–< అనేది సీతాదేవికి, గోదాదేవికి మధ్య ఉండే ఒక విధమైన సామ్యం.

అంతేకాకుండా, భరతుని రీతి కూడా గోదాదేవికి ఉన్నది–అని వ్యాఖ్యాన చక్రవర్తి తిరుప్పావై వ్యాఖ్యానావతారిక చివరిలో తెలియజేశారు. గోదాదేవి తన చెలికత్తెలను అందరినీ నిద్రలేపి, నందగోపాన్ని గృహానికి కావలి కాచే ద్వారపాలకుని నిద్రలేపి, అతని అనుమతిని పొంది, నందగోపాలుడు, యశోద, బలరాముడు మొదలైనవారిని నిద్రలేపి, తరువాత, నీలాదేవిని, శ్రీకృష్ణ భగవానుని నిద్రలేపి, ఆ భగవంతుని సన్నిధిలో విజ్ఞాపన చేస్తూ, "మేము నీతో నిత్యమైన సంబంధాన్ని కలిగి ఉండాలి, నీకే మేము దాస్యం చేయాలి. మిగిలిన ఆశలు ఏమీ లేకుండా ఉండేటట్లు మమ్ములను నీవు చేయాలి" అని నిత్యకైంకర్యాన్ని ప్రార్థించి, ఆ విధంగానే దానిని పొందింది –అని తిరుప్పావై ప్రబంధం తెలుపుతున్నది. ఆ విధంగానే, శ్రీరామాయణం యుద్ధకాండం చివరిలో " యాదావర్తతే చక్రం యావతీ చ వసుంధరా, తావత్త్వమిహ సర్వస్య స్వామిత్వ మనువర్తయ " అని భరతుడు పలికిన శ్లోకం ఉన్నది. ఎంత కాలం చక్రం తిరుగుతుందో, ఎంత చోటు ఈ భూమిలో ఉంటుందో అంత కాలం, అంత ప్రదేశంలోను నీవు నీ స్వామిత్వాన్ని ప్రవర్తింప చేస్తూ అందరిని పాలించు" అని అంటూ శ్రీరామునిలో సహజ స్వామిత్వం ఉన్నదని అన్నాడు. ఈ సూక్తిలో భరతుడు. ఏ విధంగా గోదాదేవి భగవంతుని నిత్యకైంకర్యాన్ని ప్రార్థించి పొందిందో, ఆ విధంగానే, భరతుడు కూడా భగవంతుని స్వామి త్వం అనేది స్థిరంగా నిలచి ఉండాలి– అని, అతడు చిరకాలం

పాలించాలి" అని అనడం ద్వారా "అతడు ఒక్కడే స్వామి, అని మిగిలిన వారు అందరూ అతనికి దాసులని, ఆ స్వామికి అందరూ దాస్యం చేయాలి "అనే అర్థాన్ని తెలియజేశాడు.

ఈ విధంగా తిరుప్పావై వ్యాఖ్యానావతారికలలో గోదాదేవికి, శత్రుఘ్న లక్ష్మణ భరత సీతాదేవులనే శ్రీరామాయణ పురుషులకు మధ్య ఉండే సామ్యం తెలియజేయబడింది. స్వస్తి.

# పురాణ మహిమ

లోకంలో చాలా మంది పండితులు పురాణాల విషయంలో అంత గౌరవాన్ని చూపించరు. ఎవరైనా కొంతమంది పురాణ ప్రవచనం చేస్తే వారిని చూచి "ఏదో పురాణాన్ని చెబుతున్నారు, కథలను చెబుతున్నారు" అని చాలా తక్కువగా పలకడం కనిపిస్తుంది. పురాణాలలో అవగాహన కొంతమంది భాగ్యవంతులకే కలుగుతుంది. కారక శ్రుతిలో" ఇతిహాస పురాణం చ సర్వాస్తాః" అని చెప్పబడినందువల్ల ఇతిహాస పురాణాలు వేదాలవలె నిత్యమని అనడంలో లోటు లేదు. ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" అనే వచనం ప్రసిద్ధం. ఇతిహాస పురాణాలను తెలియనివారిని అల్పశ్రుతులని పక్కకు గెంటివేస్తున్నది. శాస్త్రం. వేదాలకు వ్యాఖ్యానం ఆవశ్యకమని భావించిన మహర్షులు పరావర తత్వాలను కరతలామలకంగా దర్శించి, చాలా దయ కలవారై, భగవంతుని ప్రేరణతోనే స్మృతులను రచించారు. వాటిలో, స్మృతులు వేదాలలోని పూర్వ భాగమైన కర్మకాండకు వివరణ రూపాలుగా అవతరించాయి. మనువు, అత్రి యాజ్ఞవల్క్యుడు, పరాశరుడు పారాశర్యుడు మొదలైన మహర్షులు రచించిన ధర్మశాస్త్ర స్మృతులు అనబడుతున్నాయి. ఇతిహాస పురాణాలు వేదాలలోని ఉత్తర భాగమైన ఉపనిషత్తులకు వివరణ రూపాలుగా అవతరించాయి "ప్రాయశః పూర్వభాగార్థవర్ణనం ధర్మశాస్త్రతః, ఇతిహాసపురాణాభ్యాఏ. ఙ వేదాంతార్థఃప్రకాశ్యతే"(ఇంచుమించుగా వేదంలోని పూర్వ భాగంలో గల అర్థం ధర్మశాస్త్రాల వల్ల వర్ణింపబడుతున్నది. ఇతిహాస పురాణాల వల్ల వేదాంతార్థం వివరింప బడుతున్నది) అనే సూక్తిని గమనించాలి. కర్మకాండకు వ్యాఖ్యాన మైన మృతుల కంటే కంటే బ్రహ్మ కాండ వ్యాఖ్యాన రూపమైన ఇతిహాస పురాణాలు చాలా గొప్పవి అనే విషయం చెప్పకుండానే తెలుస్తుంది. ఇప్పుడు నేను పురాణాల గొప్పతనం చెప్పదలుచుకున్నాను. సర్గం, ప్రతిసర్గం, వంశం, మన్వంతరం, వంశానుచరితం అనే ఈ అంశాలను పురాణాలు ప్రతిపాదిస్తాయి. వీటిలో, సర్గం అంటే, సద్వారకంగా, అద్వారకంగా జరిగే జగత్తు యొక్క సృష్టి. ప్రతిసర్గం అంటే నిత్య నైమిత్తిక ప్రాకృత రూపమైన ప్రళయం. స్థూలచిదచిద్విశిష్టబ్రహ్మం సూక్ష్మచిదచిద్వివిశిష్ట బ్రహ్మంగా మారే

స్థితి, అది. ఇక వంశం అంటే, సృష్టి ఆరంభంలో జరిగిన మహాపురుషుల సంతాన క్రమం. మన్వంతరం అంటే, బ్రహ్మచేత సృష్టి ప్రయత్నంలో ప్రయత్నించేటట్లు చేయబడిన స్వాయంభువమనువు, స్వారోచిష మనవు మొదలైన మనువుల వ్యాపారం. వంశానుచరితం అంటే, పుణ్యశ్లోకుల చరిత్రల వర్ణనం. ఇతిహాసాల పరిస్థితి ఇటువంటిది కాదు. పురాణాలు వైష్ణవం, నారదీయం, భాగవతం మొదలైన విధంగా 18 పురాణాలు ఉన్నాయి. వీటికి తోడు ఉప పురాణాలు కూడా ఉన్నాయి. ఇవి అన్ని ఆయా కల్పాలలో సత్వ రజస్తమో గుణాల ప్రాచుర్యం కారణంగా సాత్విక రాజస తామసాలనే పేర్లను పొందుతున్నాయి.

**పాద్మపురాణంలో**

"వైష్ణవం నారదీయం చ తథా భాగవతం పరమ్
గారుడం చ తథా పాద్మం వారాహం శోభనం స్మృతమ్,
సాత్వికాని పురాణాని శోభనాని శుభాననే,
బ్రహ్మాండం బ్రహ్మ వైవర్తం మార్కండేయం తథైవ చ,
భవిష్యత్ వామనం బ్రాహ్మం రాజసాని నిబోధ, మే,
శైవ మాగ్నేయకం చైవ స్కాందం తథైవ చ,
కౌర్మం చైవ తథా మాత్స్యం తామసాని ప్రచక్షతే"

(విష్ణు పురాణం, నారదీయ పురాణం, భాగవతం, గరుడ పురాణం, పద్మ పురాణం, వరాహ పురాణం అనే ఇవి సాత్విక పురాణాలు. బ్రహ్మాండపురాణం, బ్రహ్మవైవర్త పురాణం, మార్కండేయ పురాణం, భవిష్యత్ పురాణం, వామన పురాణం, బ్రహ్మ పురాణం అని ఈ పురాణాలు రాజస పురాణాలు. శైవపురాణం, అగ్ని పురాణం, స్కాందపురాణం, కూర్మ పురాణం, మత్స్య పురాణం అనే ఇవి తామసాలు)

అని చెప్పబడింది. వీటిలో, రాజసతామసాలు అయిన పురాణాలను వదిలిపెట్టి, సాత్విక పురాణాలను గ్రహించాలి అని భారద్వాజ మహర్షి ఈ క్రింది వచనాల ద్వారా తెలియజేశారు.

"నాద్రియేత పురాణాదీన్ రాజసాన్ తామసాన్ తథా,
అనీశానాం పరేశత్వం వృథా యత్రోపవర్ణ్యతే"
(రాజస తామస పురాణాలను ఆదరించ కూడదు, ఎందుకంటే, పర దేవత కాని దేవతలు వ్యర్థంగా అందులో పరదేవతగా వర్ణింప బడుతున్నారు)
ఆ విధంగానే, మాత్స్యపురాణంలో కూడా
అగ్నేః శైవస్య మాహాత్యం తామసేషు ప్రకీర్తితమ్,
రాజసేషు చ కల్పేషు మాహాత్యం బ్రహ్మణో విదుః
సాత్వికేష్వథ కల్పేషు మాహాత్మ్య మధికం హరేః
(అగ్ని యొక్క, శివుని యొక్క గొప్పతనం తామసపురాణాలలో కీర్తింప బడినది. రాజస పురాణాలలో బ్రహ్మ గొప్పతనం చెప్పబడింది. సాత్విక పురాణాలలో విష్ణువు యొక్క గొప్పతనం వర్ణింపబడినది)

అని ఈ విషయం చెప్పబడింది. పూర్వం ప్రస్తావించిన సూక్తులను అన్నిటిని మన పూర్వాచార్యులు ఉదాహరించారు.

"వేదేషు పౌరుషం సూక్తం పురాణేషూ చ వైష్ణవమ్
భారతే భగవద్గీతా ధర్మశాస్త్రేషు మానవమ్" అనే ప్రమాణ వచనంవల్ల వేదలలో పురుష సూక్తం గొప్పది అని, స్మృతులలో మనుస్మృతి గొప్పది అని, మహాభారతంలో భగవద్గీత గొప్పది అని, పురాణాలలో శ్రీవిష్ణుపురాణం గొప్పది అని తెలుపబడుతున్నది. అందువల్లనే శ్రీయామునులు తమ స్తోత్రరత్నంలో " తత్వేన" ఇత్యాది శ్లోకంలో శ్రీవిష్ణుపురాణాన్ని పురాణరత్నంగా పేర్కొన్నారు.




మదురకవులు, తిరువళిక్కేణి

# మధుర కవులు

"యస్య దేవే పరా భక్తిః యథా దేవే తథా గురౌ,
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః"

ఎవనికి ఆచార్యుని విషయంలో దేవునిలో ఉన్నంత భక్తి ఉంటుందో, అతనికి గురువు చెప్పిన అర్థాలే కాక చెప్పని మంచి మంచి అర్థాలు కూడా మనసులో స్ఫురిస్తాయి—అని శ్వేతాశ్వతరోపనిషత్తు ఆచార్య వైభవాన్ని తెలిపింది. "ఆచార్యదేవో భవ" అని తైత్తిరీయోపనిషత్ ఆచార్యుని దైవంగా భావించమని తెలిపింది. ఇటువంటి వేద సూక్తుల అర్థాన్ని ఆచరించి, లోకానికి ఉపదేశించిన మహనీయులు మధుర కవులు. వీరికి తల్లిదండ్రులు పెట్టిన పేరు ఏమో తెలియదు గానీ, ఈ పేరుతోనే వీరు లోకంలో ప్రసిద్ధులయ్యారు. వీరికి ఈ పేరు రావడానికి గల కారణం—వీరికి ఉన్న సాటిలేని ఆచార్య భక్తి. భక్తి అంటే—పెద్దల విషయంలో ఉండే ప్రేమ. "మహనీయ విషయిణీ ప్రీతిః భక్తిః " అని పెద్దలు భక్తి శబ్దాన్ని నిర్వచించారు. తనకంటే పెద్దలైన వారి విషయంలో ఉండే ప్రీతికి భక్తి అని పేరు. ఈ భక్తి మూడు విధాలుగా ఉంటుందని శాస్త్రం తెలుపుతున్నది. భగవద్ విషయంలో ఉండే ప్రీతి మొదటి దశ. దీనికి ప్రథమ పర్వం అని పేరు. భక్తుల విషయంలో ఉండే ప్రేమకు మధ్యమపర్వం అని పేరు. ఆచార్యుని విషయంలో ఉండే ప్రీతికి చరమ పర్వం అని పేరు. పర్వమంటే చెరకుగడలోని కణుపు. చెరకు గడలో ఉండే మొదటి కణుపులో ఉండే తీపికంటే రెండవ కణుపులో తీపి ఎక్కువగా ఉంటుంది. రెండవ కణుపులో ఉండే తీపికంటే మూడవ కణుపులోని తీపి ఎక్కువగా ఉంటుంది. ఆ విధంగానే భగవంతుని విషయంలో ఉండే ప్రీతి కంటే భక్తుల విషయంలో ఉండే ప్రీతి ఎక్కువ తీపిగా ఉంటుంది. భక్తుల విషయంలో ఉండే తీపికంటే ఆచార్యుని విషయంలో ఉండే ప్రేమ చాలా మధురంగా ఉంటుంది. అందువల్ల ఆచార్య భక్తి చాలా మధురమైనది. ఇటువంటి మధురమైన ఆచార్య భక్తిని కలవారై, తమ ఆచార్యులైన నమ్మాళ్వార్ల విషయంలో మధురమైన ప్రబంధాన్ని రచించినందున వీరికి 'మధుర కవులు' అనే పేరు

వచ్చింది—అని పెద్దలు అంటారు. ఇటువంటి మధురభక్తి పురాణ పురుషులలో శత్రుఘ్నునకు ఉన్నదని పెద్దల వివరణ.

వీరు చైత్ర మాసంలో చిత్రా నక్షత్రంలో పాండ్య దేశంలో జన్మించారు. సంప్రదాయంలో వీరు కుమదుడు అనే నిత్యసూరుని అంశతో అవతరించారని భావింపబడుతున్నారు. "మేషే చిత్రాసముద్భూతం పాండ్యదేశే గణాధిపమ్, శ్రీపరాంకుశసద్భక్తం మధురం కవిమాశ్రయే" అనే వీరి స్తుతి శ్లోకం ఈ విషయాన్ని తెలుపుతుంది.

జైమిని సామవేదాన్ని అధ్యయనం చేసే పూర్వ శిఖా శ్రీవైష్ణవ బ్రాహ్మణ కుటుంబంలో వీరు జన్మించారు. సూర్యోదయానికి ముందే అరుణోదయం జరిగేటట్లు శ్రీవైష్ణవ సంప్రదాయంలోసూర్యునిగా భావింపబడే నమ్మాళ్వారుల అవతారానికి ముందు ఈ మధురకవుల జన్మ సంభవించిందని పెద్దలంటారు.

యుక్తవయసులో జాతకర్మ, నామకరణం మొదలైన సంస్కారాలను పొందిన వీరు వేదాలను, సకల శాస్త్రాలను చక్కగా చదివి, మధురమైన కవిత్వాన్ని చెప్పగలిగిన శక్తిని కూడా సంపాదించారు. గొప్ప జ్ఞానం, భక్తి, వైరాగ్యాల రూపమైన మధుర కవులు ఒక పర్యాయం ఉత్తర భారతంలోని క్షేత్రాలను దర్శించడం కోసం అయోధ్య నగరాన్ని చేరి, రామచంద్రమూర్తిని దర్శించి కొంతకాలం అక్కడ నివాసం చేశారు. ఒక నాడు దక్షిణ భారతంలోని తిరుక్కోవలూరు అనే క్షేత్రంలో ఉండే శ్రీకృష్ణుని స్మరించి, ఆ క్షేత్రం ఉండే దిక్కు అయిన దక్షిణం వైపు తిరిగి చూశారు. అప్పుడు వారికి ఆకాశంలో గొప్ప తేజస్సు కనిపించింది. రెండు మూడు దినాలు గడిచిన తరువాత కూడా ఆ తేజస్సు వారి కంటికి ఆ విధంగానే కనిపించినందున "ఈ తేజస్సు సామాన్యమైనది కాదు, దివ్య తేజస్సు, దీని మూలమేమో తెలుసుకోవాలి" అని అనుకొని ఆనాడే దక్షిణ దిక్కుగా ప్రయాణం చేశారు. క్రమంగా శ్రీ రంగాన్ని చేరి అక్కడ గమనించగా మధుర కవులకు ఆ తేజస్సు కురుకాపురి

(ఆళ్వార్ తిరునగరి) అనే వైష్ణవ క్షేత్రం ఉండే దిశలో కనిపించింది. అప్పుడు వారు ఆ క్షేత్రాన్ని చేరగా ఆ దివ్యతేజస్సు అక్కడ అంతర్ధానమైనది.

అక్కడ మధుర కవులు, ఒక చింత చెట్టు కింద పద్మాసనంలో యోగ సమాధిలో ఉండే నమ్మాళ్వార్లను చూసి, ఆ తేజస్సు వారి నుండి పుట్టినదని గ్రహించారు. వారితో నేరుగా సంభాషించాలని తలచి అక్కడే చాలా కాలం మధుర కవులు వేచి ఉన్నారు. ఎంత కాలమైనా నమ్మాళ్వార్లు కళ్ళు తెరిచి చూడలేదు. అప్పుడు మధుర కవులు "వీరికి చెవులు ఉన్నాయా? వినిపిస్తున్నదా?" అని పరీక్షించి తెలుసుకోవడం కోసం ఒక పెద్ద రాయిని ఎత్తి వారి ముందు పడవేశారు. ఆ రాయి చేసిన శబ్దాన్ని విని ఆళ్వార్లు కళ్ళు తెరిచి చూశారు. అప్పుడుమధురకవులు "శెట్రత్తిన్ వయిట్రిలే శిఱియదు పిఱన్దాల్ ఎట్రై త్తిన్ఱు ఎజ్గే కిడక్కుమ్?" (జ్ఞానం లేని శరీరంతో జ్ఞానం కలిగిన ఆత్మకు సంబంధం కలిగితే, ఆ ఆత్మ దేనిని అనుభవిస్తూ, దేనిని ఆశ్రయించుకుని ఉంటుంది?) – అని ప్రశ్నించారు. దానికి ఆళ్వార్లు "అట్రై త్తిన్ఱు అజ్గే కిడక్కుమ్" – (ఆ ఆత్మ ఆ శరీరాన్ని, దాని వల్ల కలిగే సుఖదుఃఖాలను అనుభవిస్తూ, శరీరంలోనే ఉంటుంది)–అని బదులు ఇచ్చారు.

ఈ సమాధానాన్ని వినగానే మధుర కవులు "వీరు సామాన్యులు కాదు, మహా జ్ఞాని, వీరిని ఆశ్రయించి తరిస్తాను" అని వారిని ఆశ్రయించి, వారినే సర్వస్వంగా భావించి, వారికి సపర్యలు చేయడం ఆరంభించారు. క్రమంగా ఆళ్వార్లు అనుగ్రహించిన తిరువిరుత్తం, తిరువాశిరియం, పెరియతిరువందాది, తిరువాయ్ మొళి–అనే నాలుగు వేదాల సారమైన నాలుగు దివ్యప్రబంధాలను, వాటిలోని అర్థాలను గ్రహించారు.

కొంతకాలానికి నమ్మాళ్వారులు పరమపదించారు. మధుర కవులు వారి ప్రబంధాలను తాళపత్రాలలో వ్రాసి, వాటిని గానం చేస్తూ, దానికి అనుగుణంగా తాళాలు వాయిస్తూ, వాటి అర్థాన్ని లోకంలో ప్రచారం చేయడం ఆరంభించారు. అప్పుడు ఆ కాలంలోని కొందరు సంఘ కవులు "మాతో వాదించి మీరుజయిస్తే తప్ప ఆళ్వారుల

ప్రబంధాలను మేము అంగీకరించము, వాటిని ప్రమాణంగా ఒప్పుకోము" అని అడ్డుకున్నారు. అప్పుడు మధుర కవులు తిరువాయ్ మొళి ప్రబంధంలోని "కణ్ణన్ కళళిణై" అనే దశకాన్ని తాళపత్రం పై రాసి, దానిని సంఘకవులకు ఇచ్చి, "దీనిని సంఘ ఫలకంపై పెట్టండి, ఇది సంఘ పరీక్షకు నిలిస్తే, దీనిని సంఘ ఫలకం అంగీకరిస్తే దీనిని మీరు అంగీకరించండి" అని అన్నారు. సంఘ కవులు దానికి అంగీకరించారు. ఆ విధంగానే నమ్మాళ్వార్ల ప్రబంధంలోని ఆ దశకాన్ని ఇతర సంఘకవుల గ్రంథాలను సంఘ ఫలకంపై పెట్టగానే, ఆ పలక మిగిలిన సంఘకవుల కావ్యాలను పక్కకు తోసి, ఆళ్వారుల పాశురాన్ని మాత్రం గ్రహించింది. అప్పుడు సంఘ కవులందరూ ఆశ్చర్యపడి నమ్మాళ్వారుల ప్రబంధాలను ప్రమాణంగా అంగీకరించి, వాటిని కీర్తించారు.

తర్వాత, మధుర కవులు ఆళ్వారుల ప్రబంధాలను లోకంలో ప్రచారం చేస్తూ, వారిని కీర్తిస్తూ 11 పాశురాలను కల "కణ్ణినుణ్ శిఱుత్తాంబు" అనే ప్రబంధాన్ని రచించారు. ఇందులోని మొదటి పాశురంలో–తమకు శ్రీకృష్ణుని నామాన్ని చెప్పినప్పుడు కలిగే అనుభవం, ఆనందం కంటే ఆ శ్రీకృష్ణుని కీర్తించిన ఆళ్వారుల నామాన్ని చెప్పినప్పుడు కలిగే అనుభవం చాలా మధురమైనది–అని అంటూ"నణ్ణి త్తెన్ కురుకూర్ నంబి ఎన్టక్కాల్ అణ్ణిక్కుమ్ అముదూఱుమ్ ఎన్నావుక్కే" అని అన్నారు. ఇంతేకాక, తాము ఉపదేశించిన ఈ "ఆచార్య భక్తి" అనే గొప్పమార్గాన్ని అనుసరించినవారికి పరమపద ప్రాప్తి తప్పక లభిస్తుంది–అని, వారు ఉండే చోటు సాక్షాత్తు పరమపదమే అని "మధురకవి శొన్న శొల్ నమ్బువార్ పది వైకున్దమ్, కాణ్మినే" అని అన్నారు.

నమ్మాళ్వార్లు జన్మవల్ల నాలుగవ వర్ణానికి చెందినవారైనా, తాము అగ్రవర్ణానికి చెందినా, వారిలోని జ్ఞానవైభవాన్ని చూచి, వారిని తమ ఆచార్యులుగా స్వీకరించిన మధుర కవులు చూపిన మార్గం నిజంగా మధురమైనది. వారి ఆచార్యభక్తి మధురమైనది. వారు రచించిన ప్రబంధం మధురమైనది. ఇందువల్ల వీరికి మధురకవులు అనే అనే నామం సార్థకమైనదికదా!

## శ్రీకుస్టప్పాకమ్ శ్రీనివాసాచార్య స్వామి

అనాది కాలంగా కాంచీపురం మహావిద్వాంసులు వెలిగిన విద్యా కేంద్రంగా భాసించింది. ఇప్పటికి సుమారు 140 సంవత్సరాలకు ముందు దక్షిణ భారతదేశంలోనేకాక ఆసేతు హిమాచలం మహావిద్వాంసులుగా పేరు పొందిన విశిష్టాద్వైత విద్వాంసులలో శ్రీ కుస్టప్పాకమ్ శ్రీనివాసా చార్య స్వామి వారు అగ్రగణ్యులు. వీరు, తిరుపతిలోని శ్రీపురిశై శ్రీ రంగాచార్య స్వామి వారు – ఇద్దరూ ఆనాటి పండితలోకంలో సూర్య చంద్రులవలె వెలిగారు. వీరిద్దరూ శ్రీశైలానంతార్య వంశానికి చెందినవారే కావడం విశేషం. శ్రీనివాసాచార్య స్వామి వారు కాంచీపురానికి సమీపంలోని కుస్టప్పాకమ్ అనే అగ్రహారానికి చెందిన వారు. "కుస్టప్పాకమ్ శీమాచ్చార్ స్వామి" అనే పేరే వీరికి ప్రసిద్ధి చెందింది. ఉత్తర భారతంలో అయితే వీరికి “శిజ్గళాచ్చార్ స్వామి"అని పేరు. సంస్కృత పాఠశాల 20 సంవత్సరాల కాలం చాలా గొప్పగా నిర్వహింపబడిఃది. అందులో న్యాయ వేదాంతాల ప్రవచనం జరిగేది.

ఈ స్వామి చతుఃశాస్త్రాలలో అసమానమైన వైదుష్యాన్ని కలవారని, న్యాయ వేదాంతాలలో సాటి లేని పాండిత్యం కలవారని పేరు పొందారు. న్యాయవాదాలు జరిగేటప్పుడు ఎంతమంది ఎన్ని వాదాలు చేసినా, చివరికి వీరు చెప్పిన కోటి మాత్రమే చివరి వరకు నిలబడి గెలిచేది అని పెద్దలు అనేవారు. వీరి గృహం చిన్న కాంచీపురం సన్నిధివీథిలోలో ఉండేది. ఆ వీధిలోనే శ్రీ వానమామలై మఠంలో వీరి నిర్దేశకత్వంలో ఎంతోమంది పండితులు ఇందులో శాస్త్రాధ్యయనం చేసి కృతార్థులయ్యారు. వీరు శ్రీ భాష్యంలోని అపూర్వమైన అర్థాలను వెలికితీస్తూ, వేదాంత దేశికుల అధికరణ సారావళితో పోలిన అపూర్వమైన గ్రంథాన్ని స్రగ్ధరావృత్తాలలో రచించారు. దానికి వీరే స్వయంగా నవీనన్యాయ శైలిలో పరిష్కారాలను చేస్తూ వ్యాఖ్యానాన్ని రచించారు. ఈ గ్రంథం కేవలం అశూద్రాధికరణం వరకు మాత్రమే ముద్రింపబడింది. ఇది పండిత లోకానికి లోటు అనే చెప్పాలి. వీరి వంశానికి చెందిన వేరొక ప్రసిద్ధ పండితులు శ్రీపురిశై కృష్ణమాచార్య స్వామివారు తిరుపతిలోని సంస్కృత పాఠశాలలో ఎంతోమంది జిజ్ఞాసువులకు జ్ఞానభిక్షను పెట్టారు.

# విష్వక్సేనుడు

శ్రీమన్నారాయణుని పరివారంలో విష్వక్సేనుడు చాలా ముఖ్యమైనవాడు. గరుడుడు విష్ణువునకు సేనాధిపతిగా, ధ్వజంగా సేవ చేయగా, ఆదిశేషుడు శయ్యగా మారి, విష్ణువునకు సేవచేస్తాడు, ఆ విధంగానే విష్వక్సేనుడు కూడా భగవంతునకు సేనాధిపతియై జగత్తును నిర్వహించే భారాన్ని తాను వహిస్తాడు– అని ఆగమాలలో, పురాణాలలో చెప్పబడుతున్నది. విశ్వక్సేనుడు జగన్నిర్వహణ భారాన్ని వహిస్తాడు అనే విషయాన్ని. "విష్వక్ సమంతాత్ సేనా యస్య సః విష్వక్సేనః– అంతటా వ్యాపించిన సేన కలిగినవాడు" అనే విష్వక్సేన నామనిర్వచనం తెలుపుతున్నది. విచిత్రం ఏమంటే ఈ నామం విష్ణువునకు కూడా ఉన్నదని "విష్వక్సేనో జనార్ధనః" అని అంటూ అమరకోశనిఘంటువు తెలియజేస్తున్నది. విష్ణువునకు పేరు అయినప్పుడు అంతటా వ్యాపించేవాడు–అనే అర్థాన్ని ఈ పేరు ఇస్తుంది. వైష్ణవ సంప్రదాయాన్ని అనుసరించేవారి ఇళ్లలో గాని, విష్ణు దేవాలయాలలో కానీ ఏ కార్యక్రమాలను ప్రారంభించినా, ముందుగా విష్వక్సేనునకు ఆరాధన చేసి, ఆ కార్యక్రమాలను మొదలు పెట్టడం అనేది సంప్రదాయం ఈ విధంగా కూడా విష్వక్సేనునకు గల ప్రాధాన్యం వ్యక్తమవుతున్నది. ఇతడు సంసార సంబంధాన్ని ఏమాత్రం లేని నిత్య సూరి వర్గంలో చేరినవాడే అయినా, పురాణాలలో కొన్ని చోట్ల విష్వక్సేనుని జన్మ వృత్తాంతాలు కనిపిస్తాయి. ఈ వృత్తాంతాలను భగవంతుని అవతార వృత్తాంతాలవలెనే భావించాలని, ఆయా సందర్భాలలో కొన్ని కార్యాలను నిర్వహించడం కోసం శ్రీమన్నారాయణుడు తన పరివారంలో ఒకడైన విష్వక్సేనుని ఈ విధంగా అవతరించమని ఆజ్ఞాపించాడని మనం అర్థం చేసుకోవాలి అని విజ్ఞుల వివరణం.

శ్రీ వేంకటాచల మాహాత్మ్యాన్ని తెలియజేసే వామన పురాణభాగంలో కనిపించే శ్రీ వేంకటేశాష్టోత్తర శతనామ స్తోత్రంలోని " సువర్చలా సుతన్యస్త సైనాపత్యభరాయ నమః" అనే 11వ నామం విష్వక్సేనుని ఒక జన్మ వృత్తాంతాన్ని ప్రస్తావిస్తున్నది. సువర్చలాదేవి

కుమారుడైన విష్వక్సేనునకు తన సైన్యాధిపత్యాన్ని విష్ణువు ఇచ్చాడని ఈ నామం తెలుపుతున్నది. ఆ వృత్తాంత వివరం ఈ విధంగా కనిపిస్తున్నది.

కృతయుగంలో కుంతల అనే అప్సరస దుర్వాసమహర్షి శాపం వల్ల వీరబాహుడనే వ్యాధునకు సువర్చల అనే పేరుతో కుమార్తెగా జన్మించింది. ఒకనాడు ఆమె ఋతుస్నానాన్ని చేసి, నర్మదా నదీ తీరంలో సంచరిస్తూ ఉన్నది. అప్పుడు వరుణుడు ఆమె విషయంలో ఆసక్తిని కలవాడై ఆమెతో సంగమాన్ని పొందాడు దానివల్ల ఆమెకు సర్వ లక్షణ సంపన్నుడైన ఒక కుమారుడు కలుగుతాడని అతడు వరమిచ్చాడు. ఆ తరువాత, ఆషాఢ మాసం పుష్యమీ నక్షత్రంలో సువర్చలకు మిక్కిలి బలశాలి, అన్ని లక్షణాలను కలిగినవాడైన ఒక కుమారుడు జన్మించాడు. అతనికి 10 సంవత్సరాల వయస్సు ఉండగా తల్లి మరణించింది. తర్వాత అతడు కశ్యప మహర్షిని ఆశ్రయించి, ఆ ముని అనుగ్రహం వల్ల వేదవేదాంతాది శాస్త్రాలను, సకలవిద్యలను అభ్యసించాడు. అతడు తిరుమల కొండపై వృషభాచలనంలో 12 సంవత్సరాల కాలం తపస్సు చేసి, ఆశ్వయుజమాసంలో పూర్వాషాఢా నక్షత్రంలో భగవంతుని అనుగ్రహాన్ని పొందాడు. వాణి బలంగా చతుర్భుజత్వాన్ని, శంఖచక్రాది ఆయుధధారిత్వాన్ని పొందాడు. ఆగమాలలో నిర్దేశింపబడిన విష్వక్సేనుని రూపం, ఆ విధంగానే, ఆలయాలలో కనిపించే విష్వక్సేనుని రూపం నాలుగు భుజాలను కలిగి ఉండడాన్ని, శంఖచక్రాలను కలిగి ఉండడాన్ని మనం చూడవచ్చు. ఇంతే కాక, విష్ణువు తన సకల సేనకు అధిపతిగా విష్వక్సేనుని నియమించాడు.

పద్మ పురాణాంతర్గతమైన వేరొక చరిత్ర విష్వక్సేనుని ఇంకొక విచిత్రమైన వృత్తాంతాన్ని తెలుపుతున్నది. పూర్వం అమరారి అనే ఒక అసురుడు దేవతలను హింసించేవాడు. అతని హింసను భరించలేక చతుర్ముఖుడు మొదలైన దేవతలు పాలసముద్రం దగ్గరకు వెళ్లి, అక్కడ ఉండే నారాయణుని సేవించి, తమను రక్షించమని ప్రార్థించారు. అప్పుడు లక్ష్మీదేవి చెలికరత్తె బయటకు వచ్చి, భగవంతుడు త్వరలోనే

వేంకటాచలంలో ఆవిర్భవిస్తాడని, అక్కడకు వెళ్లి స్వామిని దర్శింపమని తెలిపింది. ఆ విధంగానే వారు నారాయణాద్రిని చేరి, స్వామి పుష్కరిణి తీరంలో భగవంతుని స్తుతించారు. అప్పుడు భగవంతుడు శ్రీనివాసుని రూపం లేదు ప్రత్యక్షమై, వారి యోగక్షేమాలను విచారించగా, బ్రహ్మాదులు తమకు కలిగిన ఆపదను వివరించారు. తమను కాపాడవలసినదని ప్రార్థించారు. అప్పుడు శ్రీనివాసుడు తన గణాధ్యక్షుడైన కుముదుడు అనే నిత్యసూరుని పిలిచి, అతనికి విష్వక్సేనుడనే నామాన్ని పెట్టి, తన సేనకు అంతటికి అధిపతిగా నియమించి, అసురులను సంహరించి దేవతలను కాపాడమని ఆజ్ఞ ఇచ్చాడు. ఆ విధంగా భగవంతుడు ఆజ్ఞాపించిన దినం భాద్రపద మాసంలో శ్రవణా నక్షత్రం, సోమవారంనాడు అని పాద్మపురాణం తెలుపుతున్నది.

శ్రీవైష్ణవ సంప్రదాయంలో విష్వక్సేనునకు ప్రముఖమైన స్థానం ఉన్నది. గురు పరంపరలో శ్రీమన్నారాయణునకు, లక్ష్మీదేవికి తరువాత మూడవ స్థానం విష్వక్సేనునిదే. అంతే కాదు, ఆళ్వార్లలో ప్రధానులైన నమ్మాళ్వార్లు విష్వక్సేనుని అంశతో అవతరించినట్లు సంప్రదాయంలో విశ్వాసం. నమ్మాళ్వార్లకే కాక, మిగిలిన ఆళ్వార్లు అందరికీ కూడా విష్వక్సేనుడే చక్రాంకనాన్ని చేసి, అష్టాక్షరీమంత్రోపదేశం చేశాడని కూడా చెప్పబడుతున్నది.

శ్రీమన్నారాయణుడు ఆరగించిన శేషప్రసాదాన్నే విష్వక్సేనుడు భుజిస్తాడు. అందువల్ల ఇతనికి శేషాశనుడు అని కూడా పేరు. విష్వక్సేనుడు జగద్రక్షణభారాన్ని నిర్వహించడాన్ని, భగవంతుని శేషప్రసాదాన్నే భుజించే నియమాన్ని శ్రీయామునులు స్తోత్రరత్నంలో " "త్వదీయభుక్తోజ్ఝిత శేషభోజినా, త్వయా నిసృష్టాత్మభరేణ ప్రియేణ సేనాపతినా" అని అంటూ ప్రస్తావించారు.

ఆళ్వారుల దివ్య ప్రబంధాలలో కూడా అక్కడక్కడ విష్వక్సేనుని వైభవ ప్రస్తావన ఉన్నదని శ్రీవైష్ణవాచార్యుల అభిప్రాయం. ఈ విషయాన్ని వారు అక్కడక్కడ తమ దివ్య

ప్రబంధ వ్యాఖ్యానాలలో ప్ర స్తుతించారు. నమ్మాళ్వార్ల తిరువాయ్ మొళి బ్రహ్మం ప్రబంధంలోని "ఆళియాన్ అరుళ్ తరువాన్ అమైకిన్ఱాన్ అదు నమదు విదివకైయే"(10—6—1) (చక్రధారి అయిన భగవంతుడు మనకు అనుగ్రహించడానికి సిద్ధంగా ఉన్నాడు, అది కూడా మనం నియమించిన రీతిలోనే) అనే సూక్తిని వ్యాఖ్యానిస్తూ పరాశరభట్టర్ అనే ఆచార్యులు "జగత్తును నిర్వహించే సందర్భంలో విష్వక్సేనుడు ఏది చెబితే దానినే భగవంతుడు సమ్మతించి, తన తలను ఊగిస్తాడని, దానిని చూస్తే వృద్ధమంత్రి చెప్పిన మాటను యువకుడైన ప్రభువు అంగీకరించి, తన తలను ఊపేటట్లు ఉంటుందని చమత్కారంగా వివరించారు. ఇటువంటి భావాన్నే శ్రీయామునులు పూర్వం ప్రస్తావించిన స్తోత్ర రత్న శ్లోకంలో "ప్రియేణ సేనాపతినా నివేదితం తథానుజానంత ముదారవీక్షణైః" (తనకు ఇష్టమైన విష్వక్సేనుడు చెప్పినదానిని యథాతథంగా తన చూపులతోనే అంగీకరించేవాడై) అనే ప్రయోగంలో స్ఫురింప జేశారు.

# శ్రీరామానుజుల సమతావాదం

భారతదేశంలో ప్రచారంలో ఉన్న వైదిక సిద్ధాంతాలలో మూడు సిద్ధాంతాలు ప్రధానమైనవి టీవీ ఇవి అద్వైత, విశిష్టాద్వైత, అద్వైత సిద్ధాంతాలు. అద్వైత సిద్ధాంతాన్ని శంకర భగవత్పాదులు, విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని భగవద్రామానుజులు, ద్వైతసిద్ధాంతాన్ని మధ్వాచార్యులవారు ప్రవర్తింపజేశారు. ఈ ముగ్గురు కేవలం మత ప్రచారకులే కాక, గొప్ప మానవతావాదులు కూడా. విశేషించి భగవద్రామానుజులు సమతా వాదం సిద్ధాంత దృష్టిలోనూ, సాంఘిక దృక్పథం లోను చాలా విలక్షణమైనది. ఈ విషయం నాలుగైదు విధాలుగా నిరూపించబడుతున్నది.

1) భగవద్రామానుజులకు ముందున్న శ్రీ వైష్ణవవిశిష్టాద్వైత మతప్రచారకులైన పూర్వాచార్యులు అందరూ ఆ సిద్ధాంతంలోని సంప్రదాయంలోని గొప్పతనాన్ని గమనించి, తమ దగ్గరకు వాటిని పొందడం కోసం వచ్చిన ఆ యా వ్యక్తుల శబ్దం భక్తిశ్రద్ధలను, సామర్థ్యాన్ని పరీక్షించి చూచి, యోగ్యత ఉన్నవారికి మాత్రమే ఉపదేశించేవారు. ఈ విధంగా వారు చేయడానికి కారణం గీతాచార్యుడు భగవద్గీతలో చివరలో పలికిన "ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన, న చాశ్రూషవే వాచ్యం న చ మాం యోభ్యసూయతి" (ఈ గీతను తపస్వి కానివానికి, భక్తి లేనివానికి, వినాలనే శ్రద్ధ లేనివానికి, నా విషయంలో అసూయ కలిగినవానికి ఉపదేశించరాదు) అనే సూక్తి. ఉపదేశించే ఆచార్యుని పట్ల, ఉపదేశింపబడే విషయం పట్ల శ్రద్ధ, నమ్మకం లేకపోతే ఆ ఉపదేశం ఫలించదు కదా.

అయితే, భగవద్రామానుజులు ఈ కలియుగంలో క్రమంగా వచ్చే మార్పును గమనించి, ఈ సంప్రదాయం కొంత సంస్కరణను చేశారు. "జ్ఞానాని అల్పీభవిష్యంతి" (ఈ కలియుగంలో జ్ఞానం క్రమంగా తగ్గుతున్నది) అనే మహాభారతసూక్తిని బట్టి లోకంలో జ్ఞానంపట్ల శ్రద్ధ, ఆసక్తి తగ్గడం సహజం కదా. తీవ్రమైన పరీక్ష చేస్తే తప్ప జ్ఞానోపదేశం చేయకపోతే అమూల్యమైన జ్ఞానం మరగు పడిపోయే అవకాశం, ప్రమాదం ఉన్నదికదా.

ఈ విషయాన్ని గమనించిన భగవద్రామానుజులు వినాలనే ఆశ ఉన్న వారిని ఆదరించి, వారికి సంప్రదాయాన్ని సిద్ధాంతాన్ని ఉపదేశించటం తగినది, కాలానుగుణమైనది అని భావించి, అ క్రమాన్ని ఆచరణలో పెట్టారు. గోష్ఠీపురంలో గోష్ఠీపూర్ణులు అనే పేరు కలిగిన ఆచార్యుల వద్దకు తాము 18 సార్లు వెళ్లి, ఎంతో శ్రమపడి ఉపదేశంగా పొందిన అమూల్యమైన సంప్రదాయార్థాలను అక్కడే వానిని తెలుసుకోవాలని కోరిక కలిగిన వారికి అందరికీ ఉదారంగా ఉపదేశించారు ఈ సందర్భాన్ని గమనించిన గోష్ఠీపూర్ణులు మొదట ప్రాచీనమైన క్రమాన్ని కాదని, నూతనమైన క్రమాన్ని అడిగినవారికి అందరికీ జ్ఞానోపదేశం చేసిన భగవద్రామానుజులను చూచి కోప పడ్డారు, కానీ, తరువాత శ్రీరామానుజుల అంతరంగంలోని గొప్పతనాన్ని గమనించి తమకు లేని ఔదార్యం వారి మనసులో ఉన్నది అని గుర్తించి, ఎంతో సంతోషించి, వారిని "ఎమ్బెరుమానార్ "(నా కంటే గొప్ప వారు) అనే పేరుతో పిలచి, సంభావించారు. ఈ విధంగా జ్ఞానోపదేశం పొందడానికి అందరికీ సమానమైన యోగ్యత ఉన్నది అని భావించి వాదించిన రామానుజులు సమత వాది కదా.

2) భగవంతుని దృష్టిలో అందరూ సమానులే. భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు " న మే ద్వేష్యోస్తి న ప్రియః" (నేను ద్వేషించేవాడు, లేక, నేను ప్రేమించేవాడు అనేవాడు ఎవడు లేడు) అని అన్నాడు. ఈ విషయాన్ని ఋగ్వేదఖిలంగా చెప్పబడే జితంతే స్తోత్రం " దేవానాం దానవానాం చ సామాన్యమధిదైవతమ్" (దేవతలకు దానవులకు కూడా సమానమైన దైవం భగవంతుడు) అని తెలిపింది. "సర్వే భద్రాణి పశ్యంతు" అని ఆర్ష వచనం ఈ వైదికమైన సమతా వాదాన్ని గమనించిన శ్రీ రామానుజులు, "భగవంతుని దర్శించి ఆనందించడానికి అందరికీ యోగ్యత ఉన్నది" అని భావించి, యాదవ్ ఆద్రి అనబడే తిరునారాయణ పురం లో జాతి భేదం లేకుండా అందరికీ ఆ ఆలయంలో భగవంతుని అర్చామూర్తిని దర్శనం చేసుకునే అవకాశాన్ని కలుగజేశారు. ఇది కూడా భగవద్రామానుజుల సమతాదృష్టిలోని ఒక అంశం.

3) భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు "విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని, శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః" (విద్యను, వినయాన్ని కలిగిన బ్రాహ్మణుడు, గోవు, ఏనుగు, కుక్క, ఆ కుక్క మాంసం తినేవాడు – అనే వీరిని అందరినీ పండితులు సమానంగా దర్శిస్తారు) అని అన్నాడు. వేరు వేరు రూపాలను, యోగ్యతను కలిగిన వీరిని అందరిని సమానంగా చూడడం ఏ విధంగా ?అనే ప్రశ్న ఇక్కడ కలుగుతుంది. దీనిని శ్రీరామానుజులు తమ గీతాభాష్యంలో చక్కగా విశిష్టాద్వైత సిద్ధాంతానికి అనుగుణమైన రీతిలో వివరించారు. " జ్ఞానైకాకారతయా సర్వత్ర సమదర్శినః, విషయాకారస్తు ప్రకృతేః, నాత్మనః, ఆత్మా సర్వత్ర జ్ఞానైకాకారతయా సమ ఇతి పశ్యంతి ఇత్యర్థః" (విద్యా వినయ సంపన్నుడైన బ్రాహ్మణుడు, గోవు మొదలైన వీరందరూ జ్ఞానాన్ని స్వరూపంగా కలిగినవారు కనుక వీరిని అందరినీ జ్ఞానులు సమంగా భావిస్తారు. బయట కనిపించే వీరి ఆకారంలోని భేదం ప్రకృతి వల్ల ఏర్పడింది, అంతే తప్ప, ఆత్మ స్వరూపంలోని తేడా వల్ల కాదు. ఆత్మలు అన్నీ జ్ఞానాన్ని ఆకారంగా కలిగి ఉన్నందున సమానమైనవి –అని భావం) అనే వివరణలో ఈ ప్రశ్నకు సమాధానం పలికారు. ఈ విధంగా ఆత్మలన్నిటి స్వరూపం సమానమైన దాని పలకడంకూడా సమతావాదమే కదా.

4) "మా "అంటే లక్ష్మి. " ఇందిరా లోకమాతా మా " అని అమరకోశం ఈ శబ్దాన్ని లక్ష్మీ వాచకంగా పలికింది. " మయా సహితః సమః" (మా అనబడే లక్ష్మిలో కూడిన నారాయణుడు సముడు అనబడుతున్నాడు.) అనే విధంగా సమశబ్దం లక్ష్మితో ఎల్లప్పుడు కలసి ఉండే భగవంతుని తెలియజేస్తుంది. అందువల్ల సమతా వాదం అంటే– ° లక్ష్మి తో కూడుకొన్న నారాయణుడే పరతత్త్వం° అనే వాదం. వేదం " హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ" (భూదేవి, లక్ష్మీదేవి నీకు పత్నులు) అని లక్ష్మీనారాయణుల నిత్యసంబంధాన్ని కీర్తించింది. ఈ నారాయణుడే "నారాయణః పరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః" అని పరతత్త్వంగా పేర్కొన్నది. ఈ వైదికమైన సిద్ధాంతాన్ని దివ్యసూరులు కూడా తమ దివ్యప్రబంధాలలో పేర్కొన్నారు. నమ్మాళ్వార్ లు తిరువాయ్ మొళి ప్రబంధంలో " నాళు నమ్ తిరువుడై యడికళ్ తమ్మలమ్ కళల్

వణంగి "(నిత్యం మనం లక్ష్మితో కూడుకొని ఉండే శ్రీమన్నారాయణుని భోగ్యమైన శ్రీ చరణాలను నమస్కరించి) అని ఈ సిద్ధాంతాన్ని స్పష్టం చేశారు. దీనిని భగవద్రామానుజులు శ్రీ భాష్యం, వేదార్థ సంగ్రహం, గీతా భాష్యం మొదలైన గ్రంథాలలో పలుచోట్ల విశదం చేశారు. ఈ విధంగా సమతా వాదాన్ని ఈ కోణంలో కూడా దర్శించవచ్చు.

# నీరాట్టోత్సవమ్

దేవాలయాలలో జరిగే ఉత్సవాలు అనేక విధాలుగా ఉంటాయి. ప్రతి దినం జరిగే ఉత్సవాలు కొన్ని, ప్రతివారం జరిగే ఉత్సవాలు కొన్ని, ప్రతి నెలా జరిగే ఉత్సవాలు కొన్ని, ప్రతి యేడూ జరిగే ఉత్సవాలు కొన్ని. ఈ ఉత్సవాలు ఆయా దేవాలయాలలో అనుసరింపబడే ఆగమాలకు సంబంధించి, సంప్రదాయాలకు సంబంధించి ఉంటాయి. శ్రీ వైష్ణవ సంప్రదాయానికి చెందిన దేవాలయాలలో ప్రతి ఏడు ధనుర్మాసంలో జరిగే ఉత్సవం నీరాట్టోత్సవం. ఇది ఒక విలక్షణమైన సంప్రదాయాన్ని సూచించే ఉత్సవం. గోదా దేవి యొక్క భక్తి వైభవాన్ని తెలియజేసే ఉత్సవం.

శ్రీ వైష్ణవ సంప్రదాయానికి సంబంధించిన మధుర భక్తిని ప్రచారం చేసిన భక్త కవులు ఆళ్వారులు. వీరిలో పెరియాళ్వారు ఒకరు. వీరికే 'విష్ణుచిత్తులు' అని, 'భట్ట నాథులు' అని కూడా పేరు. వీరు పాండ్య దేశంలోని శ్రీవిల్లిపుత్తూరులో జన్మించారు. ఆ ఊరిలో ఉండే వటపత్రశాయి స్వామిని 'పూల మాలికలను సమర్పించే కైంకర్యం' చేస్తూ ఆరాధించేవారు. ఇందుకోసంగా వారు ఒక అనందనవనాన్ని పెంచారు.

ఒక నాడు పెరియాళ్వారు నందనవనంలోని తులసి తోటను తవ్వుతూ ఉండగా అక్కడ ఒక స్త్రీ శిశువు వారికి కనిపించింది. వారికి సంతానం లేనందున ఆ శిశువును చాలా ఆదరంతో చేరదీసి, ప్రీతితో పెంచారు. ఆమెకు 'కోదై' అనే పేరును పెట్టారు. ఈ పేరుకు అందమైన కేశాలను కలిగినది అని, పూల మాలిక అని అర్థం. ఈ పేరే సంస్కృతంలో 'గోదా' అని వ్యవహరింపడుతున్నది.

గొప్ప విష్ణు భక్తులైన పెరియాళ్వారుల పెంపకంలో పెరిగిన గోదాదేవికి వయసుతో పాటు విష్ణుభక్తి కూడా అభివృద్ధి చెందింది. క్రమంగా ఆమె యుక్తవయస్సును పొందింది. శ్రీమన్నారాయణుని తప్ప ఇంకొకరిని వివాహం చేసుకోకూడదు అనే నిశ్చయాన్ని కూడా మనసులో ఆమె పొందింది. అయితే, తాను భగవంతుని వివాహం చేసుకోవడానికి

తగిన యోగ్యత తనలో ఉన్నదా? లేదా? అనే సందేహం ఆమెకు కలిగింది. ఆ సందేహాన్ని తీర్చుకోవడం కోసం ఆమె ప్రతి దినం వటపత్ర సాయి స్వామికి భట్ట నాథులు సమర్పించే పూలమాలను తాను ముందుగా ధరించి అద్దంలో తన అందాన్ని చూసుకొని పరీక్షించుకుని తృప్తి పడేది.

ఈ విధంగా కొంత కాలం గడిచింది. గోదాదేవి చేసి ఈ పనిని ఒక నాడు భట్ట నాథులు గమనించి చాలా బాధ పడ్డారు. స్వామికి సమర్పించే పూల మాలికను ముందుగా ఆమె ధరించడం అపచారం చేయడమే అని ఆమెకు తెలియజేసి ఆమెను మందలించారు. అపుడు గోదాదేవి శ్రీమన్నారాయణుని మాత్రమే వివాహం చేసుకోవాలి అనే తన మనసులోని అభిప్రాయాన్ని భట్టనాథులకు తెలియజేసింది.

ద్వాపరయుగంలో రేపల్లె లోని గోపికలు శ్రీకృష్ణుని పతిగా ఆరాధించి, ఆ స్వామిని పొందడం కోసం వారు ధనుర్మాసంలో కాత్యాయని వ్రతం అనే ఒక వ్రతాన్ని ఆచరించినట్లుగా గోదాదేవి పెద్దల వల్ల విన్నది. ఆ వ్రత ఫలితంగా వారు శ్రీకృష్ణుని పతిగా పొందగలిగారు అనికూడా తెలిసి కొన్నది. తాను కూడా వారి వలె శ్రీకృష్ణుని ఉద్దేశించి ఒక వ్రతాన్ని చేయాలని సంకల్పించుకున్నది. తనను ఒక గోపికగా భావించింది. శ్రీ విల్లిపుత్తూరులోని తన తోటి బాలికలను తోటి గోపికలుగా భావన చేసింది. రేపల్లె లోని గోపికలవలె తాను కూడా తన తోటి చెలికత్తెలతో కలసి భగవంతుని ఉద్దేశించి వ్రతాన్ని ఆచరించింది. ఆ వ్రతానికి తిరుప్పావై అని పేరు. ద్రావిడ భాషలో "పావై" అంటే వ్రతం అని అర్థం. తాను ఆ విధంగా ఆచరించిన వ్రత విధానాన్ని గురించి వివరించే 30 పాశురాలతో కూడిన ఒక ప్రబంధాన్ని కూడా ఆమె రచించింది. ఈ ప్రబంధానికి కూడా తిరుప్పావై అని పేరు.

ఈ ప్రబంధంలో – గోదాదేవి గోపికగా తనను భావించి, బ్రాహ్మ ముహూర్తం అనబడే ప్రాత కాలంలో నిద్రలేచి, తన తోటి కత్తెలను నిద్రలేపి, వారితో కలసి శ్రీకృష్ణ గుణ గానాన్ని చేస్తూ, వారిని వెంటబెట్టుకుని, నదిలో చన్నీళ్ళలో స్నానమాడి, శారీరకమైన పరిశుద్ధిని పొంది, పవిత్రమైన మనసుతో శ్రీకృష్ణ మందిరానికి వెళ్ళి, ఆ స్వామిని తమను కటాక్షించ వలసినదిగా ప్రార్థించి, ఆ స్వామికి, తమకు మధ్య ఉండే సంబంధం

నిత్యమైనదని విన్నపించి, తాము చేసే సేవను అతడు తప్పక స్వీకరించాలని అర్థించే క్రమం తెలుపబడింది.

ఈ విధంగా గోదాదేవి ఉదయకాలంలో తన తోటి చెలికత్తెలతో కలసి చన్నీళ్ళలో స్నానం చేసే క్రమానికి సంప్రదాయంలో 'నీరాట్టం' అని పేరు. ఈ పదాన్ని గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో చాలా చోట్ల ప్రయోగించింది. అయితే, ఈ పదం కేవలం నదిలో స్నానం చేయడాన్ని మాత్రమే తెలుపదు. ఇది ఒక విలక్షణమైన వేదాంత రహస్యాన్ని సూచిస్తుంది.

భగవంతుడు ఒక చల్లని సరస్సు వంటివాడు. "ఏష బ్రహ్మ ప్రవిష్టోస్మి గ్రీష్మే శీతమివ హ్రదమ్" (గ్రీష్మ కాలంలో ఒక చల్లని సరస్సులో స్నానం చేసినట్లుగా, సంసారంలో తాపాన్ని పొందిన నేను ఈ పరమాత్మ పొంది ఆనందిస్తున్నాను) అని పంచమ వేదమైన భారతం భగవంతుని చల్లని నీటితో నిండిన సరస్సుగా పలికింది. పలువురు ఆళ్వార్లు కూడా శ్రీమన్నారాయణుని ఒక చల్లని నీటితో నిండిన సరస్సుగా భావన చేశారు. అందువల్ల ఇక్కడ గోదాదేవి తాను తన చెలికత్తెలతో కలసి నదిలో చన్నీళ్ళలో స్నానం చేసినట్లుగా తెలుపడం ఆమె పొందిన భగవంతుని కళ్యాణ గుణాల అనుభవాన్ని సూచిస్తుంది – అని విశేషజ్ఞులైన పెద్దల అభిప్రాయం. అందువల్ల నీరాట్టం అనే పదం భగవంతుని మధురమైన అనుభవానికి ఒక ప్రతీక. ఆళ్వారుల ప్రబంధాలలోని పలు ప్రయోగాలు ఈ విధమైన వేదాంత తత్త్వాలను తెలియజేస్తాయి. గోదాదేవి శ్రీకృష్ణుని సన్నిధికి వెళ్లి, తాను చేసే సేవను స్వీకరించమని ప్రార్థించడం కూడా వేదాంతంలో చెప్పబడిన జీవుని పారతంత్ర్యాన్ని తెలియజేస్తుంది. శ్రీ వైష్ణవ దేవాలయాలలో ధనుర్మాసంలో జరిగే నీరాట్టోత్సవం ఈ విధంగా గోదాదేవి శ్రీకృష్ణుని ప్రార్థిస్తూ చేసిన తిరుప్పావై వ్రతాన్ని, ఆ స్వామి సన్నిధిలో ఆమె పొందిన అనుభవాన్ని సూచిస్తుంది.

తిరుపతిలోని గోవిందరాజస్వామి ఆలయంలో ప్రతి ఏడు ధనుర్మాసంలో ఈ ఉత్సవం చాలా వైభవంగా జరుగుతుంది. భోగి పండుగకు ఏడు దినాల ముందు ఈ ఉత్సవం ప్రారంభం అవుతుంది. ఈ ఉత్సవ దినాలలో గోదాదేవికి విశేషమైన ఆరాధన

జరుపబడుతుంది. ధనుర్మాసారాధన తరువాత ఉదయమే గోదాదేవి పల్లకీలో గోవిందరాజస్వామి ఉత్సవంగా బయలుదేరి, మాడ వీధులలో ఊరేగింపుగా వెళ్లి, కోదండరామ స్వామి ఆలయం దగ్గర రామచంద్ర తీర్థంలో ఉండే నీరాట్ట మండపంలోకి వేంచేస్తారు. అక్కడ గోదాదేవికి తిరుమంజనం, ప్రసాద నివేదన, తిరుప్పావై శాత్తుముర్రై, ఆస్థానం జరుగుతుంది. తరువాత అక్కడ గోదాదేవికి విశేషంగా పుష్పాలంకరణ జరుగుతుంది. సాయంకాలానికి గోదాదేవి తిరిగి గోవిందరాజ స్వామి ఆలయానికి 'తిరుచ్చి' అనే వాహనంలో చేరుతారు. ఈ విధంగా ఈ ఉత్సవం ఏడు దినాలు జరుగుతుంది. ఎనిమిదవ దినాన భోగినాడు గోదాదేవి శ్రీకృష్ణ స్వామితో కలసి పల్లకీలో సాయంకాలం మాడ వీధులలో ఊరేగి, తమ స్వస్థానానికి వేంచేస్తారు. కనుమనాడు గోదాదేవికి, శ్రీకృష్ణ స్వామికి ప్రణయకలహోత్సవం, కల్యాణోత్సవం వైభవంగా జరుగుతుంది.

# అరైయర్ సేవ

ఆరైయర్ సేవ అనే ఈ వైష్ణవ సంప్రదాయానికి సంబంధించిన విలక్షణమైన కళ. కొన్ని ఆలయాలలోమాత్రం భగవంతుని అర్చామూర్తి ముందు ప్రదర్శింపబడే కళ ఇది. ఆళ్వారుల పాశురాలను పాడి ఆ పాశురాలలోని అర్థాలకు అనుగుణంగా అభినయం చేసి, వ్యాఖ్యానిస్తూ, ఈ కళను ప్రదర్శిస్తారు– అరైయర్ అనే పేరును కలిగిన కళాకారులు. ఈ అరైయర్ సేవలో సాహిత్యం, సంగీతం, నాట్యం అనే మూడు విధాలయిన కళలు చోటు చేసుకుంటాయి. అంటే, ఈ మూడు కళల సమాహారమే ఈ అరైయర్ సేవ. ఇందులో ద్రావిడ దేశంలో అని పళ్ళు అనే జాతికి చెందిన సాహిత్యంలోని సంప్రదాయాలు కూడా చోటు చేసుకున్నాయి. కోయిల్ ఒఴుగు అనే శ్రీరంగాలయ చరిత్రను తెలిపే గ్రంథంలో ఈ అరైయర్ సేవకు సంబంధించిన ప్రస్తావనలు కనిపిస్తాయి.

శ్రీరంగం, శ్రీవిల్లి పుత్తూర్వంటి శ్రీవైష్ణవ దివ్యదేశాలలో ధనుర్మాసంలో ఈ అరైయర్ సేవ ప్రసిద్ధంగా జరుగుతుంది. ఆళ్వార్ తిరునగరి, నాంగునేరి వానమామలై వంటి ప్రదేశాలలో ఉండే వైష్ణవాలయాలలో కూడా ఈ అరైయర్ సేవ జరుగుతున్నది. కైశిక ఏకాదశి నాడు కొన్ని చోట్ల ఈ అరైయర్ సేవ జరిగే సంప్రదాయం ఉన్నది.

శ్రీరంగం దివ్యాలయంలో జరిగే ఉత్సవ క్రమాలను తెలియజేసే కోయిల్ ఒఴుకు అనే గ్రంథంలో చెప్పబడిన క్రమాన్ని అనుసరించి, ఈ అరైయర్ సేవారంభం తిరుమంగై ఆళ్వార్ కాలంలో జరిగిందని, అంటే, చారిత్రకుల అభిప్రాయాన్ని బట్టి, క్రీస్తుశకం ఎనిమిదవ శతాబ్దం ఉత్తర భాగంలో అరైయర్ సేవ మొట్టమొదటగా ఆవిర్భవించిందని, ఈ సేవను శ్రీరంగంలోని ఆలయంలో ఉత్సవమూర్తి ముందు తిరుమంగై ఆళ్వార్ తాము రచించిన తిరునెడుందాండకం అనే ప్రబంధాన్ని పాడి అభినయిస్తూ చేశారని తెలుస్తున్నది వైకుంఠ ఏకాదశి మరునాడు నుండి 10 నాళ్ళు అళ్వార్ తిరునగరిలో. మధురకవి అళ్వార్లు తిరువాయ్ మొఴి. పాశురాలను రాగాత్మకంగా పాడి అభినయించారట. ఇదే కళ యొక్క ఆవిర్భావం.

శ్రీవైష్ణవ గురుపరంపరా గ్రంథాలను అనుసరించి, ఈ అరైయర్ సేవ క్రీస్తు శకం 10వ శతాబ్దంలో నాథముల కాలంలో పునరుద్ధరింపబడింది. తిరుమంగై అళ్వార్ కాలంలో ఆరంభమైన ఈ సేవ మధ్యలో కొన్నాళ్ళు అంతరించిపోగా, నాథమునులు దీనిని దీనిని మళ్లీ ఆరంభించి వృద్ధి చేశారు. శ్రీ రామానుజులు దీనిని బాగా విస్తరింపచేసి, అళ్వార్ల పాశురాలలో ఉండే అర్థాలను తత్వాలను ప్రజలకు తెలిసే రీతిలో అభినయించి, తెలుపడంకోసం రామానుజదాసులు అనే కొందరిని నియమించారు. వీరి బాధ్యతలు, నియమాలు మొదలైనవి ఇదమిత్తంగా నిశ్చయింపబడ్డాయి. అరైయర్ స్వాములు అనబడేవారు నాథమునుల పరంపరలో చేరినవారుగా భావింపబడుతున్నారు. నాథమునులకు మనుమలు యమునైత్తుఱైవర్, మునిమనుమలు తిరవరంగ ప్పెరుమాళ్ అరైయర్ ఆ పరంపరలో వచ్చినవారే.

**అరైయర్ సేవాక్రమం**

శ్రీరంగంలోని దివ్యాలయంలో మార్గళి మాసం అధ్యయనోత్సవాలు అనబడే ఉత్సవాలలో 20 రోజులపాటు, మార్గళిమాసం అమావాస్య నుండి ఆరంభించి పదినాళ్ళు పగల్ పత్తు ఉత్సవాలు, వైకుంఠ ఏకాదశి నుండి ఆరంభించి పది రోజులు రాపత్తు ఉత్సవాలు– అని ఈ విధంగా 20 దినాలపాటు జరిగే ఉత్సవాలలో, శ్రీ రంగనాథుని ఉత్సవమూర్తి ముందు ఆరైయర్ స్వాములు తమ సేవను అభినయించి ప్రదర్శిస్తారు. శ్రీరంగనాథుడు అర్చకముఖంగా వారిని ఆహ్వానిస్తాడు. ఈ విధంగా వారిని స్వామి ఆహ్వానించడానికి "అరుళప్పాడు" అని పేరు. ఈ ఆహ్వానానికి బదులుగా అరైయర్ స్వాములు "ఆయిందేన్, అయిందేన్" అని అంటూ, తమ తలల పైన సరిగతో నేయబడిన శ్రీవైష్ణవ చిహ్నాలను, అంటే, నామం, శంఖం, చక్రం అనే గుర్తులను కలిగిన శిఖామణి అనబడే ఎర్రని పట్టుతలపాగను, కర్ణ పత్రాలు అనబడే చెవులను మూసే రీతిలో ఉండే పట్టలను అలంకరించుకొని, స్వామి ముందుకు వస్తారు. (" నాయిందే" అని కూడా చెబుతారు. దీని అర్థం ఏమంటే –ఇదిగో నేను ఇక్కడ ఉన్నాను– అని అర్థం).

భట్టర్ స్వాములు భగవంతునకు అలంకరింపబడిన పరివట్టాన్ని వారి తలలలో చుట్టి, స్వామి నిర్మాల్యాన్ని వారికి అలంకరిస్తారు. ఉత్సవమూర్తికి ముందు ఆరైయర్ స్వాములు కంచుతో చేసిన తాళాలను చేతిలో పట్టుకొని, స్వామి ముందు నిలుచుని పాశురాలను, పాటలను పాడి, తమ సేవను ప్రదర్శిస్తారు. భగవంతుని కీర్తిస్తూ పాడే కొండాట్టం అనబడే కార్యక్రమంతో ఈ అరైయర్ సేవ ప్రారంభమవుతుంది. ఇందులో మూడు భాగాలు ఉంటాయి.

1) ఆనాడు పాడవలసిన పాశురాలను అరైయర్ స్వాములు సంగీతాత్మకంగా పాడడం,

2) ఆ పాటలకు అనుగుణంగా అభినయాన్ని చేయడం అరైయర్ స్వాములు ఒక్కరే అనేక విధానైన పాత్రలను తమ వేషాన్ని మార్చకుండా అభినయిస్తారు. ఆ యా విభిన్న దృశ్యాలను ఆయా పాత్రల మాటల ద్వారానే మనకు అర్థమయ్యేటట్లు చేయడం జరుగుతుంది. ఒకే పాశురాల శ్రేణికి అనేక విధాలయిన రీతిలో అభినయం చేసే క్రమం కూడా ఉంటుంది.

3) గానం చేసే పాశురాలకు వివరాన్ని తంబిరాన్ పడి వ్యాఖ్యానం తెలుపుతుంది. గానక్రమంలో ఈ వ్యాఖ్యానాన్ని అభినయం చేస్తూ అరైయర్ చెప్పగా, ఇంకొక అరైయర్ పక్కనే లిఖిత గ్రంథాన్ని పట్టుకొని, అభినయించే అరైయర్ స్వామి చెప్పే ఆ వ్యాఖ్యానం సరిగా ఉందో, లేదో చూస్తారు.

చివరిలో మళ్లీ కొండాట్టం చేయబడుతుంది.

పలు విధాలైన సేవలు ఆయా దినాల ప్రాధాన్యాన్ని బట్టి చేయడం జరుగుతుంది. శ్రీ రంగంలో పగల్ పత్తు ఉత్సవంలో నాలుగవ నాడు కంసవధ, ఏడవనాడు వామనావతారం, ఎనిమిదవనాడు క్షీరాబ్ధి మథనం, పదవ నాడు రావణ

వధ అభినయాలు ప్రదర్శింపబడతాయి. ఈ కథలు అన్నీ పగలు పూర్వభాగంలో ప్రదర్శింపబడతాయి. గోదాదేవి అవతారం వంటి కొన్ని కథలు కొన్ని విశేష దినాలలో పాడబడతాయి. కర్ణాటక దేశంలో ఉండే మేల్ నాడు శ్రీనరసింహస్వామి కోవెలలో అభినయం లేకుండానే తాళాలతో మాత్రం అరైయర్ సేవ జరుగుతుంది.

## ముత్తుక్కుఱి

పగల్పత్తు 9వనాడు అరైయర్ సేవలో ముత్తుక్కుఱి అనే ఒక ప్రదర్శన జరుగుతుంది. పలువురి ఆళ్వారుల పాశురాలు, ముఖ్యంగా, నమ్మాళ్వారుల, తిరుమంగై ఆళ్వారుల పాశురాలు నాయకీ నాయకుల భావాన్ని కలిగినవి. అవి "అకత్తుఱై" అనే విభాగానికి చెందినవి భగవంతునిపై ప్రేమను కలిగినదై, మనసులో ద్రవించే నాయకికి కట్టువిచ్చి అనే సోదెను చెప్పే ఒక స్త్రీ ముత్తుక్కుఱిని చెప్పే దృశ్యం ఇది. ఇందులో అరైయర్ స్వాములే నాయకి తల్లి, కట్టు విచ్చి, అంటే, సోదె చెప్పే స్త్రీ మొదలైన పాత్రలను మార్చి మార్చి అభినయిస్తారు. తిరు నెడుం దాండకమ్ ప్రబంధంలో 11 పాశురాలు ఈ దినంలో పాడి అభినయింపబడుతున్నాయి. " పట్టుడుకక్కుమ్" అనే పాశురంనుండి ఆరంభించి పాడే పాటల చివరిలో, చెలికత్తెలకు బదులుగా ముత్యాలను పెట్టి, కుఱి (శకునాలను, గుర్తులను) చెప్పడం చేత, దీనికి "ముత్తుక్కుఱి", అని పేరు. చివరిలో సోదెను చెప్పే వనిత "నాయకిని భగవంతుడు రక్షిస్తాడు" అని గుర్తును చెప్పి ముగిస్తుంది.

## నమ్మాళ్వారుల మోక్షం

రాపత్తు ఉత్సవాలలో చివరినాడు నమ్మాళ్వారుల మోక్షం, అంటే, పరమపదోత్సవం అనే ఉత్సవం జరుగుతుంది. కథను స్పృశించేదిగా ఉన్నప్పటికీ, ఒక పాశురాన్ని ప్రస్తావించి, అందులో ఉండే దృశ్యాన్ని వివరించే రీతిలోనే ఈ అభినయం ఉంటుంది.

**వ్యాఖ్యానాలలో కనిపించే కొంతమంది అరైయర్ స్వాముల పేర్లు.**

పిళ్లై తిరునఱైయూర్ ఆరైయర్

పిళ్లై అழగియ మణవాళ అరైయర్

ఐయన్ తిరుక్కురుకై ప్పెరుమాళ్ అరైయర్

పిళ్లై దేవ ప్పెరుమాళ్ అరైయర్

ఆழ్వార్ తిరువరంగ ప్పెరుమాళ్ ఆరైయర్

తిరునారాయణ పురత్తు అరైయర్

రాజనారాయణ పెరుమాళ్ అరైయర్

తిరుక్కణ్ణపురత్తరైయర్

# అరైయర్ సేవ –2

[శ్రీఎం సుబ్బయ్య, శ్రీషణ్ముఖ శర్మ జయప్రకాష్ రచించిన "అరైయర్ సేవై – వైణవ సంపిరదాయ వ*ழி*పాట్టిల్ ఒరు నాట్టియ మరపు" అనే ద్రావిడవ్యాసానికి అనువాదం]

ఉపోద్ఘాతం

శ్రీ వైష్ణవ సంప్రదాయ పరంపరలో జరిగే ఉత్సవాల సందర్భంగా శ్రీవైష్ణవాలయాలలో భగవంతునకు జరిగే ఉపచారాలలో ఒకటి అరైయర్ సేవ. అరైయర్ సేవ అంటే ఏమి? ఈ సంప్రదాయాన్ని ఎవరు మొదట ఆరంభించారు? ఈ కళలో ఉండే విలక్షణమైన అంశం ఏమి? భారతీయ సంప్రదాయ సాహిత్య నాట్య కళలలో ఈ అభినయం ఎటువంటిది? అనే ఈ విషయాలు ఈ వ్యాసంలో పరామర్శింపబడతాయి.

భారతీయ మతాలు అనే పెద్ద శాఖలో వైష్ణవమత సంప్రదాయం ప్రత్యేకమైన స్థానాన్ని సంతరించుకున్నది. శైవం, వైష్ణవం, శాక్తం, గాణాపత్యం, కౌమారం, సౌరం అనే ఆరు విభాగాలలో శైవ, వైష్ణవ మతాలు మిగిలినవాటికంటే ఎక్కువగా గౌరవాన్ని సంపాదించుకున్నవి. శైవసంప్రదాయంలో అనేకమైన విభాగాలు ఉన్నట్లుగానే, వైష్ణవ సంప్రదాయంలో కూడా పలు విభాగాలు ఏర్పడ్డాయి.

ద్రావిడ దేశాన్ని శైవ సంప్రదాయాన్ని అనుసరించిన ప్రభువులు పరిపాలించినందువల్ల శివారాధనలలో వారు ప్రత్యేకమైన దృష్టిని పెట్టారు. అందువల్ల, వారు ఆ మతానికి సంబంధించిన దేవతారాధనలలో దైవం ముందు నిత్యం జరిగే ఉపచారాల కోసం సుమంగళి స్త్రీలను తేవారం అనే శైవసాహిత్యాన్ని పాడడం కోసం ఏర్పాటు చేశారు. ప్రభువు తరపున దైవానికి అర్చన చేసే సమయాలలో, ప్రభువుల

హారతి తరువాత, తేవారాన్ని పాడి నర్తన చేయడం అనే సంప్రదాయం ఏర్పడింది. ఆ విధంగానే, ఉత్సవ సమయాలలో అర్చామూర్తి వీథిలో వేంచేసేటప్పుడు, వీధికూడళ్లలో నర్తన ప్రదర్శనం చేయడం అనే సంప్రదాయం కూడా ఏర్పడింది. ఈ సంప్రదాయం శైవ దేవాలయాలను ఆధారంగా చేసుకుని వృద్ధి చెందింది. ఈనాడు భరతనాట్యం అనే పేరుతో ప్రసిద్ధమైన దేవదాసిల నాట్యసంప్రదాయాన్ని గమనిస్తున్నాం. ఈ సంప్రదాయం పల్లవ రాజుల కాలం అనంతరమే ఏర్పడినట్లు స్పష్టమైన ఆధారాలతో కనిపిస్తున్నది. మహేంద్ర పల్లవుడు, రాజరాజ చోళుడు, రాజేంద్రచోళుడు అనేవారు కట్టిన దేవాలయాలలో కనపడే శిల్పకళలవల్ల, రాతి శాసనాలవల్ల దీనిని తెలుసుకోవచ్చు. దైవం ముందు, అర్చన అనంతరం, నృత్యప్రదర్శన అనేది శివుని ఆలయాలలోనే కాదు, వైష్ణవాలయాలలో కూడా జరుగుతూ వచ్చేది. ఇది ఆళ్వారుల కాలానికి తరువాతనే జరిగినట్లు తెలియవస్తున్నది.

అరైయర్

శ్రీమన్నారాయణుని విషయంలో నిండైన భక్తిని కలిగిన ఆళ్వారులు ఆ శ్రీమన్నారాయణుని గూర్చి పాశురాలను పాడారు. ఆ స్వామి సన్నిధి ముంగిటికి వచ్చి పాశురాలను రాగంతో పాడి, ఆ పాశురానికి తగినట్లుగా చేతులలో అభినయాన్ని చేసి, దానికి తగిన వివరణ కూడా చేసే సంప్రదాయం అళ్వారుల తర్వాతనే శ్రీ వైష్ణవసంప్రదాయంలో ఏర్పడింది. ఈ విధమైన, సాంప్రదాయికమైన క్రియాకలాపం అరైయర్ సేవ అనే పేరుతో పిలువబడుతున్నది. భారతీయ పరంపరలో దేవాలయాలకు సంబంధించి పలు నాట్యరీతులు వృద్ధి చెందాయి. కథాకళి, కృష్ణాషట్టమ్, భరతనాట్యం, కైశిక పురాణ నాటకం మొదలైన రీతులలో అరైయర్ సేవ కూడా ఒకటి, విలక్షణమైన దైవోపచార ప్రక్రియ ఇది. ఈనాటికి దానికి చెందిన సంప్రదాయాలతో అనుసరించి వచ్చే ఆలయకళ ఇది. "అరైయర్ సేవ" అనేది లక్షణరీతుల పేర్లలో ఒక పేరు. అరైయర్ సేవ పవిత్రమైన స్వభావాన్ని కలిగినదిగా భావింపబడుతున్నది. అరైయర్ అనే పదం "దివ్య ప్రబంధాన్ని విజ్ఞాపన చేసేవారు"

("అணறపవర్")అనే అర్థంలో వ్యవహరింపబడుతున్నది. నాలాయిర దివ్య ప్రబంధంలోని తీయని పాశురాలను భగవంతుని సన్నిధిలో అభినయంతో, తాళంతో పాటు, తాళానికి తగినట్లు ఆడి, పాడి, . అభినయం చేసే సేవ అరైయర్ సేవ అని అనబడుతున్నది.

## అరైయర్ సేవ నాట్యరంగప్రదర్శనవంటిది

అరైయర్ సేవ అనేది వైష్ణవాలయాలలో ఉత్సవమూర్తి ముందు చేయబడుతుంది. అర్చామూర్తికి రెండు వైపులా ప్రేక్షకులు ఉంటారు. ఈ సన్నివేశం నాట్యరంగసన్నివేశం వలె ఉంటుంది. ఇక్కడ భగవంతుని సన్నిధి నాట్యరంగంవంటిది. నాట్యరంగంలో జరిగే ప్రదర్శనను చూచే ప్రేక్షకులవంటివారే దేవాలయానికి వచ్చిన భక్తులు. ఈ నాట్య రంగనిర్వాహకులుగా దేవాలయంలో కైకర్యం చేసేవారు అవుతున్నారు. నాట్యరంగ దృష్టిలో ఈ ఆరైయర్ సేవా కార్యక్రమాన్ని చూచినప్పుడు, నాట్యరంగప్రదర్శనను చేసేవారుగా అరైయర్ స్వాములు, భక్తులు ప్రేక్షకులుగాను భగవంతుని సన్నిధియే నాట్యరంగంగాను అవుతున్నది. ఈ అరైయర్ సేవ భక్తి భావం ఉట్టిపడేటట్లుగా చేయబడుతుంది. ఈ విధంగా దేవాలయమే ఒక నాట్య రంగం. ఆళ్వారుల ద్రావిడ ప్రబంధాలను ద్రావిడ వేదం అని అంటారు. ఈ ద్రావిడ వేదాన్ని శ్రీవైష్ణవాలయాలలో గానం చేసి, భగవంతుని కైంకర్యం చేసేవారు అందరూ మగవారే. కానీ, శైవసంప్రదాయానికి సంబంధించి నిత్యసుమంగళులు చేసే సేవను శ్రీవైష్ణవాలయాలలో మగవారు చేస్తారు. ఇదే ఈ రెండు సంప్రదాయాల మధ్య ఉండే తేడా.

## అరైయర్ సేవ పుట్టుపూర్వోత్తరాలు

శ్రీరంగంలోని రంగనాథ స్వామి ఆలయంలో ఉత్సవమూర్తి ముందు ఒక కార్తీక మహోత్సవ సమయంలో తిరుమంగై అళ్వార్లు తమ తిరు నెడుందాంగమ్ అనే ప్రబంధంలోని పాశురాలను రాగాత్మకంగా పాడి అభినయించారు –అని తెలుస్తున్నది. దీనినిబట్టి తిరుమంగై ఆళ్వార్ కాలంలోనే దివ్యప్రబంధాలను వైష్ణవాలయాలలో పాడే

సంప్రదాయం రూపొందింది— అని తెలుస్తుంన్నది. వీరి కాలానికి తరువాత నాలాయిర దివ్య ప్రబంధపాశురాలు శ్రీవైష్ణవాలయాలలో పాడడం అనే సంప్రదాయం నిలిచిపోయింది. తరువాత, ఆ ప్రబంధం లిఖితప్రతులు కూడా కనబడకుండా పోయాయి వీటిని మళ్లీ వెదకి అన్వేషించి సంపాదించినవారే, నాథములు. వారు సంగీతంలో, అభినయంలో దిట్ట. ఆళ్వారుల పాశురాలకు రాగం, తాళం అనే వాటిని చక్కగా కూర్చి, ఒక క్రమాన్ని వారు ఏర్పరచారు. తమకు పుత్ర సంతానం లేనందున, తమ మేనల్లుళ్లు అయిన కీഴ అగత్తాన్, మేలై అగత్తాన్ అనే ఇద్దరికి నాథమునులు నాలాయిర దివ్య ప్రబంధాలను, వాటికి తాము కూర్చిన రాగాలను, తాళాలను నేర్పించారు —అని చెప్పబడుతున్నది. ఈ ఇద్దరూ ప్రబంధ పాశురాలను భగవంతుని అర్చామూర్తికి తిరువీథులలో ఉత్సవం జరిగేటప్పుడు పాడారు. వీరికి తరువాత శ్రీయామునుల పుత్రులైన తిరువరంగత్తు పెరుమాళ్ అరైయర్ అనేవారు ఈ పాశురాలను రాగతాళ యుక్తంగా పాడడంతో పాటు, అభినయాన్ని కూడా చేర్చి, దీనిని వృద్ధి చేశారు. ఈ విధంగా రాగతాళాలతో ఆళ్వారుల పాశురాలను పాడి అభినయించేవారికే అరైయర్ అని పేరు. వచ్చింది. వీరి వంశ పరంపరలో వచ్చినవారు. వీరి దగ్గర ఈ కళను అభ్యసించి నేర్చుకున్నవారే, ఇప్పుడు తమిళనాడులో అంతటా ఉండే అరైయర్ స్వాములు అని నమ్మబడుతున్నది. మొట్టమొదటగా ఈ సేవ శ్రీరంగం రంగనాథ స్వామి ఆలయంలో ఆరంభింపబడింది. ఈ సంప్రదాయాన్ని భగవద్రామానుజులు చక్కగా అభివృద్ధి చేసి, క్రమబద్ధీకరణ చేసి, శ్రీ వైష్ణవాలయాలలో అన్నిటిలోనూ అనుసరించే ప్రయత్నం చేశారు. ఆరైయర్ అనేవారు ఆలయాలలో మూలమూర్తికి చేసే పలు విధాలైన సేవలలోని దైనందిన కార్యక్రమాలలో, నాథమునుల ఏర్పాటుకు తగినట్లు— ధనుర్మాసం, పాల్గునమాసంలో ఉత్తరా నక్షత్రంలో జరిగే ఉత్సవం, గోదాదేవి అవతార మహోత్సవం మొదలైన ఉత్సవాలలో, అధ్యయనోత్సవాలలో భగవంతుని ముందు అరైయర్ సేవను చేయడం అనే క్రమం ఏర్పడింది.

## అరైయర్ స్వాముల వేషధారణ, అలంకరణవిధానం

అరైయర్ స్వాములు ఈ విధంగా పాశురాలను గానం చేసి అభినయించటానికి ప్రత్యేకమైన నాట్యరంగం అనేది ఏది ఉండదు. దేవాలయంలోని అర్చామూర్తి ముందు కేవలం నేలపై, దేవాలయంలో ఉండే దీపాల వెలుతురులో ఈ ప్రబంధ పాశురాల గానం, అభినయం చేయబడుతాయి. దేవాలయాలలో ఉత్సవమూర్తి ముందు ఈ సేవ చేయబడేటప్పుడు, అరైయర్ స్వాములు పంచకచ్చం ధోవతిని కట్టుకొని, "అరైయర్ కుళ్ళాయ్ "అనబడే కిరీటం వంటి టోపీని ధరిస్తారు. భగవంతునకు సమర్పించబడి, తొలగింపబడిన నిర్మాల్యంతో పాటు, సంప్రదాయ సిద్ధమైన చిహ్నాలను కూడా అలంకరించుకొని ఉంటారు. వీరు అలంకరించుకునే కుల్లాయి అనే టోపీ చాలా విలక్షణంగా ఉంటుంది. ఇది వెల్వెట్ వస్త్రంతో చేయబడుతుంది. ఒక అడుగు ఎత్తు ఉంటుంది. దాని పైభాగంలో కలశం ఆకారంలో ఉండే ఇత్తడి పట్టీలు ఉంటాయి. ముందు భాగంలో తెంగలై సంప్రదాయానికి చెందిన పుండ్రం, శంఖ చక్రాలు ఉంటాయి. దీనిని అరైయర్ స్వాములు మాత్రమే ధరిస్తారు. చెవులను మూసే రీతిలోని రెండు కర్ణాభరణాలవంటివి వేలాడుతూ ఉంటాయి. కుల్లాయి పూర్తిగా సరిగతో, వెల్వెట్ వస్త్రంతో చేయబడినదిగా ఉంటుంది.

## శ్రీవైష్ణవ సంప్రదాయాలు నిర్వహింపబడే విధానం

శ్రీవైష్ణవసంప్రదాయానికి చెందిన 108 దివ్య దేశాలలో

మార్గశిర మాసంలో చాలా విశేషంగా ఒక ఉత్సవం జరుగుతుంది. దానికి పగల్ పత్తు, రాపత్తు, (అధ్యయనోత్సవం) అని పేరు. మార్గశిర మాసం శుక్లపక్షం పాడ్యమినాటి నుండి ఆరంభించి, 10 నాళ్ళు జరిగే ఉత్సవం పగల్ పత్తు ఉత్సవం. ఈ దినాలలో జరుగుతుంది. ఈ దినాలలో ఉత్సవమూర్తి ముందు అరైయర్ లు తాళంతో ప్రబంధ పాశురాలను పాడి, అభినయం చేస్తారు. స్వామి అనుజ్ఞను తీసుకొన్న తరువాతనే ఈ కార్యక్రమం జరుగుతుంది. ఈ విధంగా భగవంతుని వద్ద అనుజ్ఞను పొందడానికి అరుళప్పాడు అని పేరు. భగవంతుడు అర్చకముఖంగా ఆజ్ఞాపించగానే "నాయిందే

"అని సమాధానాన్ని పలికి, తమ అభినయాన్ని ఆరంభిస్తారు. ఈ అరైయర్ సేవా క్రమం మూడు భాగాలను కలిగి ఉంటుంది.

ముందుగా భగవంతుని కీర్తనం జరుగుతుంది. దీనికి "కొండాట్టమ్ "అని పేరు. దీనికి తరువాత, ఆ దినం పాడి అభినయించవలసిన పాశురాలను పాడి అభినయించే కార్యక్రమం జరుగుతుంది. ఇది రెండవ భాగం. దీనికి తరువాత, అంతవరకు పాడి అభినయించిన పాశురాల వ్యాఖ్యానాన్ని అనుసంధించే కార్యక్రమం జరుగుతుంది. ఇది మూడవ భాగం. ఒక అరైయర్ వ్యాఖ్యానాన్ని చెబుతూ ఉండగా, ఇంకొకరు ఆ వ్యాఖ్యానం రాయబడిన లిఖిత ప్రతిని చేతిలో పెట్టుకుని, అనుసంధించే రీతిని సరి చూస్తూ ఉంటారు. ఈ విధమైన అనుసంధానం కూడా రాగయుక్తంగానే ఉంటుంది. అది పూర్తి కాగానే మళ్లీ చివరిలో కొండాట్టమ్ జరుగుతుంది. ఈ క్రమంలో దివ్యప్రబంధపాశురాలు ప్రతి దినం అభినయం చేయబడతాయి. ఇది "ఇయల్, ఇశై, నాటకం" (సాహిత్యం, సంగీతం, నాట్యం) అనే ముత్తమిழ் కలిసిన ప్రక్రియ, అంటే, ఒక సమాహార కళ.

ఇందులో ఇంకొక విశేషం కూడా ఉన్నది. అళ్వార్ల పాశురాలలో ముఖ్యంగా, తిరుమంగై ఆళ్వారుల, నమ్మాళ్లారుల పాశురాలలో పలు పాశురాలు శృంగార రసాత్మక పాశురాలు. వీటిలో నాయకీ నాయక భావం అధికంగా ఉంటుంది. ఈ పగల్పత్తు ఉత్సవాలలో తొమ్మిదవ నాడు జరిగే అభినయంలో "ముత్తుక్కుఱి" అనే ఒక అభినయం జరుగుతుంది. నాయకి తల్లి తన కుమార్తెకు మనోవ్యాధి ఏర్పడిందని గ్రహించి, దానిని పోగొట్టడం కోసం కారణాన్ని గ్రహించి నివారణను చెప్పే ఒక కోయవనితను పిలిచి, వ్యాధికి కారణాన్ని తెలిసికొమ్మని ఆమెతో చెబుతుంది. అప్పుడు ఆ కోయస్త్రీ ముత్యాలను పెట్టి, నాయకికి కలిగిన మనో వ్యాధికి కారణాన్ని, దానికి నివారణను పరీక్షించి చూస్తుంది. దీనికి ముత్తుక్కుఱి అని పేరు. ఈ కార్యక్రమంలో

ఒకే అరైయర్ స్వామి తల్లిగా, నాయకిగా, కట్టువిచ్చిగా, అంటే, సోదెను చెప్పే కోయవనితగా, మూడు దశలలో అభినయాన్ని చేయడం జరుగుతుంది.

ఈ విధంగానే రాపత్తు ఉత్సవాలలో కూడా, ఆరైయర్ సేవ జరుగుతుంది. ఈ ఉత్సవాలలో పదవ నాడు నమ్మాళ్వారులకు భగవంతుడు మోక్షాన్ని అనుగ్రహించే సన్నివేశం జరుగుతుంది. ఇది కథకు సంబంధించినది కాకుండా, ఒక పాశురానికి వ్యాఖ్యానాన్ని చెప్పే రీతిలో ఉంటుంది. ఆ పాశురంలో ఉండే సందర్భాన్ని వివరించేదిగా అభినయం కూడా చేయబడుతుంది.

ఈ దశలో కూడా ఒకే అరైయర్ స్వామి వేరు వేరు పాత్రలను, వేషాన్ని మార్చుకోకుండానే, అభినయిస్తారు. ఆయా దృశ్యాలలోని భేదాన్ని మాటల ద్వారానే వ్యక్తం చేయడం జరుగుతుంది. ఒకే పాశుర సందర్భానికి పలు దశలలో అభినయించే విలక్షణమైన ఈ కళను ఈ అరైయర్ సేవలోనే చూడవచ్చు. అభినయాన్ని ప్రదర్శించే దశలో ఇది కూడా నాటక శైలిని కలిగి ఉంటుంది. భారత దేశంలోని నాట్య కళలలోని ముఖ్యమైన అంశాలలో ఈ విధమైన నాట్యకళ చాలా విలక్షణమైనదని చెప్పాలి. ఒక్కరే అనేక విధాలైన దశలలో అభినయించడం అనేది చాలా గొప్ప విషయం.

**ఈ విద్యను అభ్యసించే ప్రకారం**

ఈ కళను అభ్యసించే కాలం 12 సంవత్సరాలు. ఇక్కడ ఆచార్యుడు తండ్రియే. ఈ అరైయర్ సేవలోని అభినయాన్ని మగవారు మాత్రమే చేయడంవల్ల పుత్రసంతానం లేనివారు బిడ్డలను స్వీకారంచేసుకోవచ్చు. ఇది ఒక గురుకులవాసంగానే నేర్పింపబడుతున్నది ఒకరు ఈ సేవలో అన్వయించాలంటే, వారు చాలా కాలం కఠినమైన అభ్యాసాన్ని వ్రతంగా స్వీకరించాలి. ద్రావిడ భాషలో, దివ్యప్రబంధాలలో చక్కని జ్ఞానం, అనుభవం కలిగినవారై ఉండడంతో పాటు అభినయజ్ఞానం కూడా గంభీరంగా, ఋజువుగాను కలిగి ఉండాలి. ఆ విధంగా పొందిన తరువాత కలిగిన

తరువాత సేవయే ప్రసన్నంగా ఉంటుంది. ఇందులో ప్రదర్శించే పలు విధాలైన హస్తముద్రలు భరతనాట్యంలో చెప్పబడే ఒక చేతితో, రెండు చేతితో ప్రదర్శించే ముద్రలవలె ఉన్నప్పటికీ, వీటిలో ఒక విలక్షణమైన హస్తముద్రల ప్రయోగం కనిపిస్తుంది. నాలాయిర దివ్య ప్రబంధంలోని పాశురాలను కంఠస్థం చేయడం ఈ విద్యను నేర్వడంలోని ఒక అంశం. ఈ అభినయంలో ఉపయోగించే రెండు తాళాలలో, ఒక తాళానికి నమ్మాళ్వారులు అని, రెండవ తాళానికి నాథముని అని పేరు. ఈ తాళాల ధ్వనితోనే పాశురాల గానం చేయబడుతుంది. అరైయర్ సేవను చేసేవారిని "అరైయర్, అణ్ణ్ఱయర్, విణ్ణప్పమ్ శెయ్ వార్, పాడువార్, ఇశైక్కారర్ తంబిరాన్ మార్ " అనే పేర్లతో పిలవడం జరుగుతుంది. ఆళ్వారుల ప్రబంధాలను సంగీతంతో పాటు పాడడం, వాటిలోని అర్థానికి తగినట్లు అభినయించడం, వాటి వ్యాఖ్యానాలను అందంగా చెప్పడం—< అనే ఈ మూడు విధాలైన ద్రావిడ కళల (ముత్తమిழ்) సమాహారమే ఈ అరైయర్ సేవ.

పాశురాలను సంగీతంతో పాటు పాడడం, పాశురానికి అభినయం చేయడం, పాశురానికి వివరణ చెప్పడం— అనే క్రమంలో ఈ కళ అళ్వార్ పాశురాలకు ఇయఋ్పా, ఇశైప్పా —అనే విభాగంతో ఉండదు. ముత్తమిழ் అనబడే మూడు విధాలయిన ద్రావిడ కళలలో మూడవది అయిన నాటకకళను కూడా మేళవించి, ముత్తమిழ் రూపాన్ని ఇచ్చిన "ఓదువార్"(శైవసంప్రదాయానికి చెందిన గాయకుల) వలె ఈ అరైయర్లు ఎక్కువమంది లేనందువల్ల అరైయర్ కుటుంబాలు చాలా క్రమంగా విరళం అయ్యాయి.

ఈనాడు శ్రీరంగం శ్రీరంగనాథ స్వామి ఆలయం, ఆళ్వార్ తిరునగరి ఆదినాథన్ కోవెల, ఇంకా, శ్రీవిల్లిపుత్తూరు ఆండాళ్ సన్నిధి మొదలైన చోట్ల, దక్షిణ కర్ణాటక ప్రాంతంలో ఉండే తిరునారాయణపురం ఆలయం అనే ఈ చోట్ల మాత్రమే ఈ అరైయర్ సేవ ఇపుడు ప్రచురంగా కనబడుతున్నది.

మార్గశిర మాసం పగల్ పత్తు, రాపత్తు ఉత్సవాలలో అరైయర్ సేవ గొప్పగా జరుగుతుంది. ఒక పాశురంలోని ఒక సందర్భానికి పలు దశలలో అభినయం చేసే వైలక్షణ్యం ఈ కళలోనే చూడవచ్చు. శ్రీవైష్ణవాలయాలలో ఉత్సవ సమయాలలో ఉత్సవమూర్తి వేంచేసేటప్పుడు, ఆ స్వామికి ముందు ఆళ్వారుల దివ్యప్రబంధాలు, వెనుక వైపు సంస్కృత వేదం పారాయణం చేయబడడం చూడవచ్చు. ద్రావిడ వేదం అనబడే దివ్య ప్రబంధాలు ఆ స్వామి స్వరూపరూప గుణ విభూతులను చక్కగా తెలిసికొని ముందుకు వెళుతున్నవి— అనే విషయాన్ని తెలిపే విధంగా ఆ ప్రబంధాలు స్వామికి ముందు అనుసంధింపబడుతున్నవి— అని, సంస్కృత వేదం ఆ స్వామిని దరి చేరలేక అన్వేషిస్తూ వెంబడిస్తున్నది— అనే సంగతిని సూచించడం కోసం అధి భగవంతునకు వెనుక పారాయణం చేయబడుతున్నదని దీనికి పెద్దలు వివరణను తెలియజేస్తారు. దీనివల్ల దివ్యప్రబంధమహిమ స్పష్టమవుతున్నది. ఈ కారణంచేతనే—

"పణ్ణ్ఴ మఱైకళ్ ముఱైయిడ ప్పైందమిఴ్ ప్పిన్ శెన్ఱ పచ్చై ప్పశుమ్ కొండలే" (ప్రాచీనమైన భేదాలు మొరపెడుతూ ఉండగా, నవనవమైన ద్రావిడ ప్రబంధాల వెంట వెళ్లే పచ్చని వర్ణాన్ని కలిగిన మేఘ రూపుడు) అని కుమరనార్ పాడారు. కంబమహాకవి కూడా శడగోపర్ అందాది ప్రబంధంలో " అళ్వారుల ప్రబంధాలను ఒక అడుగు అయినా దాటి భగవంతుడు వెళ్ళగలడా?" అని అన్నారు.

ఆరైయర్ స్వాముల అభినయం అన్ని వైష్ణవాలయాలలోనూ ఉండి ఉండాలి. అయినా, ఆ విధంగా ఈనాడు కనిపించడం లేదు. నాలాయిర దివ్య ప్రబంధ పాశురాలను రాగయుక్తంగా పాడి అభినయం చేసి, వాటికి వ్యాఖ్యానం చెప్పే ప్రక్రియయే ఇది. దీనిని ఇయల్, ఇశై, నాటకం అనే మూడు ద్రావిడ రీతులు కలసిన "ఆట్టమ్" అని అంటారు. ఆరైయర్ స్వాములు ఎటువంటి ప్రతిఫలాన్ని కోరకుండా శ్రీరంగనాథునకు చేసే అరైయర్ సేవ వారి భగవంత్కైంకర్యపరత్వానికి ఒక గొప్ప సూచకం. అందుచేతనే వీరిని అళ్వార్లతో సమానంగా స్తుతించడం జరుగుతున్నది.

ఈ అరైయర్ సేవకు సంబంధించిన మరిన్ని విస్తృతమైన వివరాలు 1985 వ సంవత్సరంలో ముద్రింపబడిన కే. వెంకట రామన్ గారి "అరైయర్ సేవ" అనే ద్రావిడ గ్రంథం, ఎం అరుణాచలం గారి. "తమిழ் ఇలక్కియ వరలాఱు– పన్నిరండామ్ నూఱ్ఱాణ్డు ఇరండామ్ భాగమ్" అనే గ్రంథం మొదలైన గ్రంథాలలో లభిస్తాయి.

***